# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 రాజమహేంద్రవరము 16-12-1978 సంచిక 4


## —* ఈ సంచికలో *—



1—1—79 సంచికలో తిలక్ కవితలు - సంప్రదాయపు ఛాయలు, మోక్షశాస్త్రంలో కామశాస్త్రం మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# ఆముక్తమాల్యద - రాయల సమాస రచనా వైశిష్ట్యము

— శ్రీ ధూర్జటి వేంకటబాలాజి, ఎం. ఏ.

శ్రీకృష్ణదేవరాయలు తన అసమాన పాండితీ ప్రతిభతో, అద్వితీయమైన కవితాకౌశలంతో, అన్ని విశిష్టలక్షణాలు రంగరింపజేసి "ఆముక్తమాల్యద' ను ఒక సర్వోత్కృష్టమైన ప్రబంధరాజంగా తీర్చిదిద్ది, 'ఆంధ్రభోజుడు సాహితీసమరాంగణ సార్వభౌముడు' అను బిరుదముల కర్హుడయ్యెను.

రాయల శైలి అతి క్లిష్టము, గంభీరము, ఉదాత్తము నై వాడిగా వేడిగా పఠితల మనోనయనాల నాకర్షించి దీర్ఘాలోచన పరులను గావించును. అంతటి ప్రతిభ, రాయలు కలిగియుండుట వలననే, ఆంధ్ర వాఙ్మయలోకంలో అతని యుగానికి ఒక ప్రత్యేకమైన స్థానం గలదు. అంతేకాక రాయల శతాబ్దినాటి కవులు, పురాణ రచనా మార్గాన్నివీడి, ప్రబంధరచనా మార్గాన్ని అనుసరించుట ఆ యుగమునందలి మరియొక విశిష్ట లక్షణము.

రాయల శైలిలో మనలను మిక్కిలిగా ఆకర్షించునది ఆయన ఉత్తమసమాస భూయిష్ఠరచనము. అతడు స్వయముగా కవి, పండితుడు, సంస్కృతాంధ్రభాషలలో చక్కని కూలంకష పరిజ్ఞానం కలవాడగుటచేత అతని రచనలన్నియు బిగువుగా చక్కని శైలితో, ఉత్తమమైన అర్థగాంభీర్యంతో అలరారుచుండును. అందువలననే రాయలు తన రచనల ద్వారా పైఁజెప్పబడిన బిరుదుల కర్హుడయి, వాఙ్మయలోకంలో ఒక విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించిన కవీశ్వరుఁడయ్యెను. ఆతఁడు వాడిన సమాసాలు లోకోత్తరాలు. అవి పాఠకలోకాన్ని ఉఱ్ఱూతలూగునట్లు చేయును. నన్నయభట్టువలె రాయలు శాబ్దికుడు. అందువలన ఆతని సమాసరచన గలగల గంగాప్రవాహంవలె సాగిపోవుచు, పఠితలను ఏవో సుదూరతీరాలకు తీసికొని పోవుననుటలో ఆశ్చర్యంలేదు.

ముఖ్యంగా ఆతని విలక్షణ దృష్టి సమాసరచనయందు కనిపించును. అన్యదేశ పదజాల ప్రభావంవలననూ, ఆనాటి సాంఘిక వ్యవహార భాషా ప్రభావం వలననూ, ఆతఁడు కొన్ని వైరి సమాసాలను గావించెను. అంతేకాక భాషా ప్రయోజనదృష్ట్యా తనకంటె ప్రాచీన కవులగు తిక్కన, శ్రీనాథ, ఎఱ్ఱన పోతనాది కవులు ప్రయోగింపని కొన్ని విలక్షణ సమాసాలు రచించెను. దీనినే రాయల 'సమాసవైచిత్రి' అందురు.

సాంస్కృతిక సమాసములు:- ఆముక్తమాల్యద అతిప్రౌఢప్రబంధము. సమాసములు బహుక్లిష్టములు, దురవగాహములు. కొన్ని సమాసము లున్నను, "అళికంబున అక్షిని దాచిన" పదములు పెక్కు గలవు. మృదుపద సమ్మేళనమై, చక్కటి భావస్ఫోరకమైన సమాసాలునూ గలవు. ఈ క్రింది పద్యంలో విష్ణుచిత్తుని వర్ణన శార్దూల విక్రీడితంలో రచింపబడినది.

శా॥ "అందుండుం ద్వయసద్మపద్మవదనుం
డద్వంద్వుఁడ శ్రాంతమో
హాంధూబద్ధమధు ద్విషద్ద్విరదు డ
న్వర్థాభిధానుండురు
చ్ఛందోబృంద తదంతవాగపర నా
సంజాత తజ్జన్యని
ష్పంద ద్వైత సుసంవిదాలయుఁడు ని
ష్ఠన్ విష్ణుచిత్తుం డనన్" 1ఆ77ప.

ఇందు "అశ్రాంతమోహాంధూబద్ధ మధుద్విషద్ద్విరదుడు", "ఉరుచ్ఛందోబృంద తదంతవాగపరనాతజ్జన్య నిష్పంద ద్వైత సుసంవిదాలయుడు" ఇవి రెండు దీర్ఘ సమాసాలు. పెక్కు సమాసాలు తత్సమ పద భూయిష్ఠములు. శబ్దాడంబరత, అర్థగాంభీర్యము, నీ కావ్యమున నెల్లెడల వెల్లివిరియుచున్నవి. పైని ఉటంకించిన సమాసము లన్నియు సాంస్కృతికములే. సాంస్కృతికములైనను, అన్వయకాఠిన్యము లేక రసవంతముగా నుండు పద్యము లీ కావ్యమునందనేకములు గలవు.

మ. గృహసమ్మార్జనమో, జలాహరణమో
శృంగార పల్యంకికా
వహనంబో వనమాలికా కరణమో
వాల్లభ్య లభ్యధ్వజ
గ్రహణంబో వ్యజనాతపత్ర ధృతియో
ప్రాగ్దీపికారోపమో
నృహరీవాదము లేల శౌరె యితరుల్
నీ లీలకుం బాత్రముల్" 2ఆ91ప.

రామరాజభూషణుడు, కాకమాని మూర్తి, పుష్పగిరి తిమ్మన, కంకంటి పాపపాపరాజు మొదలగు వారికవనము సంస్కృతశబ్ద బహుళముగా నున్నదిగాని ఈ గ్రంథకర్తవలె నింతగాఢ సంస్కృతమును ఎవ్వరును గానముచేయలేదు. ఈ యంశమునకీ ప్రబంధమంతయు ఉదాహరణమై యున్నది. 'చనికాంచెన్' అని ప్రారంభించి పద్యమంతయు నొకే సమాసముగా పూరించిన పద్యము లనేకములు గలవు. ఈ కావ్యములో ప్రౌఢత్వము తెచ్చిన ప్రధాన విషయము సంస్కృతాంధ్రపదముల యొక్క విచిత్ర సమ్మేళనము.

చంపకమాలా వృత్తము :-

"పగడపుఁ జాయ చెందిరము
బ్రామినపాండ్యవధూ
కుచంబులన్
నగు నరుణంపు బొండముల
నారికెడంబుల వజ్రకుట్టిమం
బగు పథముం జెలంగు పవ
నాహృత శేషితరత్నరత్న క
క్రిగతరు సంతతిన్ బ్రథమ
భార్యఁబురిన్ గిఱువుంచె
వార్ధినాన్". 1 ఆ 54 ప.

ఈపద్యమును దిఙ్మాత్రంగా పరిశీలింపవచ్చును. సంస్కృతాంధ్ర శబ్దాలు ఇచట పూర్వకవులయొక్క సమ్మేళనం కన్నా విచిత్రంగా మేళవించినవి. "చెందిరము బ్రామినపాండ్య వధూకుచంబులన్ నగు" నడుమ సంస్కృత సమాసము. "అరుణంపు బొండములు" ఇది మఱియొక పద్ధతి. "గిఱువుంచుట" మరియొకపద్ధతి. ఈ విధమైన వైలక్షణ్యము కావ్యమునందెచ్చట చూచినను, గోచరించును. ఇది అలవాటైన పద్ధతి కాదు. కవిత్రయం పోతన, శ్రీనాథుడు మొదలైనవారు అచ్ఛిక సంస్కృతములను కలిపిన పద్ధతి మన కలవాటుగా నున్నది. ఇది విచిత్రముగా నున్నది. ఇక అచ్ఛిక సమాసము లెడనెడ చక్కటివి చూపట్టుచున్నవి.

అచ్ఛికసమాసములు :- నడిరేయి, నట్టిల్లు, రెన్నాళ్ళు, మూన్నాళ్ళు, చెఱకువిల్లు మొదలగునవి.

మిశ్రమసమాసములు రెండు విధములు
నీమంపు మూన్నాళ్ళు
పుష్పబాణాని చెఱకువిల్లు.

| | | |
|---|---|---|
| తృతీయాతత్పురుష | — | వలయధ్వని |
| చతుర్థి | — | మందాకు |
| పంచమీ | — | కూటిపేద |
| షష్ఠి | — | శార్ఙ్గరపీదళనంబు |
| సప్తమీ | — | పురిభాగవతులు. |

బహువ్రీహి-వనజాక్షి, చంచలనేత్రి, అవభృథప్లుతోత్తమాంగుడు.

కర్మధారయము-న్యాయార్జితవిత్తము, తేలిన బావులు, గుప్తదానములు, పరమపురుషార్థములు.

ద్విగుసమాసము - రెన్నాళ్ళు, సప్తరాత్రముల్, పన్నిద్దరు శూరులు.

రూపకము-పరిభవశల్యము, సంసారిపాంథుడు, వలగండ్ల పాలకండ్లు, తల్పుటురము.

ద్వంద్వము-రేవగలు, వేరువెల్లలు, గురుగుంజెంజలి, గుంటకాలువలు.

ఆముక్తమాల్యదయందు ఉత్తు పై టుక్కు, నుక్కులు రానివి అని చెప్పదగిన సమాసములు కొన్ని గలవు.

మందాకు - ద్వితీయాశ్వాస, 37 ప.

వెలుగాకన్ (4ఆ.283ప) అనువానిని ఉదాహరణములుగా తీసికొనవచ్చును.

రాయలు సమాసరచనయందు గావించిన మరొక వైచిత్రి.

సమాసమున లట్టునకు లోపమువచ్చుట
వనదండ-ప్రథమాశ్వాసము - 14 ప.
ఏనికదోయి-ప్రథమాశ్వాసము- 53ప.

ఈ విధముగా "చెంగల్వడిగ్గియ. చన్దోయి, వాలుగ మొత్తము మెడగుంపుల వంపులు, పసిండిముక్వగమి, చెంగలువ దండలు పోలుదురు. దొప్పగమి, కూఱ పసుపు, సంపెంగ దండవోలె, మల్లు పోరునన్. పొరివిశంగా యంగములం, వెండిసలాకపిండు, బెల్లుగంటల, ఊరుపు పిండువలపులం, పలువన్నెముగ్గు' మొదలగునవి ఉదాహరణములుగా స్వీకరింపవచ్చును.

షష్ఠాశ్వాసములో 21 వ పద్యములో "రేవగటివేళ - అప్రాణి వాచకశబ్ద ఘటితద్వంద్వము ఏకవచనాంతంబునగు" అను సూత్రము ద్వారా సమసించును.

(సూ॥ ప్రౌఢవ్యాకరణము- సమాసపరిచ్ఛేదము-30 వ సూత్రము)

రాయల సమాసరచనయందు మఱొక వైలక్షణ్యము సమాస రచనయందు "అన్వాదులకు ఉలోపము చేయుట' ముఖ్యమైనది. ఇందు రాయలదృష్టి ఏమిటో యెఱుంగజాలము.

అన్నవి- ( 1ఆ-65 వ పద్యము )
అన్మాటులన్ - (1-84). చన్సంజ్ఞ- (1-84); అన్ర్రుత్యురూక్తి, వాసనలన్గూళి (3 ఆ-70 వ పద్యం) అన్మతిన్- (2 ఆ-62); అన్వీలువాదిన్- (3-8వ పద్యం) అన్వారు- (4ఆ-7 వ పద్యం); బ్రహ్మాండమన్గరడిన్- (3ఆ-69) మనుచరిత్ర (చూడుము ప్రౌఢవ్యాకరణము- సంధిపరిచ్ఛేదము) బాలవ్యాకరణములో చిన్నయసూరి సంధి పరిచ్ఛేదములో "కర్మధారయమునందు మువర్ణములకు పుంపులగు" అని చెప్పిన సూత్రము ద్వారా మువర్ణములకు లోపముచెంది, వాని స్థానములో పుంపులు ఆదేశముగా వచ్చినవి. కాని సమాసరచనయందు రాయలు సమాసవిధిగా 'ము' లోపము గావించెను.

గంధపట్టెలు-ద్వితీయాశ్వాసము-10 వ పద్యము, సరపువ్వులందు - పంచమాశ్వాసము - 106 వ పద్యము ఇందులకు "(దంతపు) సరకట్టులు" అని మనుచరిచరిత్రలో గలదు. మనుచరిత్ర - ప్రథమ ఆ- 15 వ పద్యము, గందవొడి - మనుచరిత్ర. ప్రథమ ఆ- 15వ పద్యము, ఎప్డు కొగందపట్టెగతినుండన్నాదుకేల్ -
క. క. ర-539 బోనపుట్టిక - క. క. ర - 5 (340)

అనురుల బోనవుట్టిక-పారిజాతాపహరణము-2-70 ఈ లక్షణము కేవలము "ఆముక్తమాల్యదయందే గాక రాయల ఇతర కృతులయందు ముఖ్యముగా "జాంబవతీ పరిణయము" అను నాటకము తప్ప మిగిలిన మదాలసచరిత్ర సత్యావధూప్రీణనములందు గానవచ్చును.

పుంప్వాదేశమునకు సమాసమున స్వరము పరమైనచో టుగాగమును రాని రూపములను కొన్నిటిని రాయలు గావించెను.

సమీపపూరనె - 6-32; ఇందులకు తమలపాకు-జగత్ప్రసిద్ధము-తామరపాకు శృంగార నైషధము.

పట్టపేనుంగు-పారిజాతాపహరణము - (3ఆ - 38) సమాసమున తద్ధరార్థ విశేషణోకారమునకు నుగామము - ఊరుంగాయలు - (4-161) ఊరుబిండి - పాండురంగమాహాత్మ్యము - (4-184) పెద్దనగారు మనుచరిత్రలో ఈ ప్రయోగము నే వాడినారు. పుట్టంగోడు గట్లు-(4-115)అందురా? ఇది అలుక్సమాసము. ఊరబిచ్చుక వంటిది.

క్రియాజన్య విశేషణములలో తత్క్రియాకర్త షష్ఠీసమాసమును బొందుట. ఇది రాయల మఱొక వైలక్షణ్యము.

మీ పాడిన హరిచందంబులు-5 ఆశ్వాసము-49 వ పద్యము, కంతుని యిడిన పత్త్రికేకు- 5 ఆశ్వాసము-32 వ పద్యము ఇవి అద్భుత పాండిత్యస్ఫోరకములు గాని దుష్టములు గావు.

మహాత్తులకు విశేషణములైన అమహద్వాచకములకును, అట్టి నపుంసకలింగములకును, అట్టి అమహద్వాచక శబ్దాంత సమాసములకును, ఉభయధా విభక్తి కల్పనము.

నృపశేఖర-1-37; నృపకుంజర-1-38; భారతభూమి సురవతంసంబు - (1-78); భక్తిహృద్భ్రమత్ృణదాత్ర - (1-98); నిగమభూధరముల్-(2-33); విద్వద్వతంసంబు-(2-39); ఇందు కులావతంసంబు-1-40 మొదలగునవి. "ఉభయధా" అన్నందులకు 25 ప్రమాణములు గలవు.

పార్థివవంశశేఖరుడు-భారతము - ఆది పర్వము-3వ ఆ. శ్రీ వాణీలీలాస్పద -3; పాండవసింహంబు-6 వ. ఆశాపమోక్షకారణుండు-8; అక్కుమార సింహంబు-ఉత్తర హరివంశము-5ఆశ్వాసము-253; భావుక కారణా-6-273; సృష్టిస్థితిలయ కారణుండు-మార్కండేయ పురాణము-1.9

ధరణీకాంతావతంసంబు - కేయూర బాహుచరిత్రము-3-30శత్రుగ్రీష్మనజాలా-పాండురంగమాహాత్మ్యము - 4-310, ప్రేమాస్పదులు - పాండురంగమాహాత్మ్యము - 5-166, అంబురుహాగ్భరకులాభరణంబు-మనుచరిత్ర-1-51, గృహస్థరత్నంబు-మనుచరిత్ర - 1-72, వచోగాంభీర్యలీలాస్పదా-మనుచరిత్ర - 1-81 మరువాన్నారీ శిరోరత్నమున్-మనుచరిత్ర-2-25, సుధీలేఖద్రుమ-మను చరిత్ర-2-1 "కింపురుషవృషభుండు" అని యింకనూ పెక్కు విధములైన ఉదాహరణములను స్వీకరింపవచ్చును." భువి దివి నీవలెన పొడమె పురుషవతంసా.

మానికులాలతింస-మల్ల. విప్ర-3-18; 6-31 "మరితావతంస" అన్నచో మహాత్రీ భావము కూడా స్పష్టీకృతము. అయినను 'త్రిధా' అనియు చెప్పనక్కర లేదు. బహువ్రీహి సమాసముగా గాన వచ్చును. ఆ సమస్తమునకు నాసీరమై వచ్చు నళిన బాంధవు టెక్కియంబుపై దీపించు నద్దమునగ- (మనుచరిత్ర) అనిన వారికి నర్జునుండనిరొ. మమ్ము ననగతాపత్యులని పల్కితతిముదమున - నేను కొంతేయులము మతి యెట్లు సెప్పుమయ్య. తపతి కపత్యులమైన తెలుగు భారతము-ఆదిపర్వము-7వఆ-66వ పద్యము. ఇందు కవి ప్రయుక్తములెన్నియో ? లేఖకాది జనితములెన్నియో ? ఆముక్తమాల్యద యందు రాయలు గావించిన ఉపమాన పూర్వపద కర్మధారయములు.

పాదాబ్జఘాలాలంకారకచావళిమకర దీవ్యత్కుండలాంచన్ముఖా - 1వఆ-26 వ పద్యము.

వజ్రదోః పరిఘకశీకృతాన్య నరపాలకులు-2-34, పుంగవకకుత్థ్సుండు-4-165

అన్నిటికంటె ముఖ్యంగాఁ జేర్కొనదగిన అంశం. సమాసంలో ఏకాక్షరశబ్దమునకు హ్రస్వము వచ్చుట.

నిస్తులాస్య శ్రీ వయఃస్తంభ నిక్షిప్త సింబచ్ఛద భ్రుకల్పంబు నిక్క-5-67

తమదు కూర్పులు -2-61

మీదుపాటలందు - 5-45

మాదగు వృత్తాంతములు వినిపింపవలయు-5-16

మీదు విమర్శల్ -భోజరాజీయము-1, 16, 17

మీదు సన్నిధిన్ - బసవపురాణము-

తమదు ప్రాణలింగంబులని- 3-191

మొల్లలు మల్లెలు మొదలైన శబ్దముల్-4-225

మీదుబ్రతుకు - +-226

సమాసరచనలో రాయలు కొన్ని వ్యస్తప్రయోగములు ప్రయోగించెను. ఈ విధముగా రాయలు తన సమాసరచన ద్వారా, శైలిలో ఒక విలక్షణతను ఏర్పరచుకొని, అర్వాచీన కవులకు మార్గదర్శకు డయ్యెను.

# పురాణదంపతులు

— శ్రీ కపిలవాయి లింగమూర్తి, ఎం. ఒ. ఎల్.

అరుంధతీ వసిష్ఠులు, పార్వతీపరమేశ్వరులు, నలదమయంతులు, సీతారాములు, రుక్మిణీకృష్ణులు పురాణాల్లో ప్రసిద్ధమైనట్లు నళినీ భాస్కరులు, కైరవిణీచంద్రులు, నదీసముద్రులు, వనీవసంతులు, లతాతరులు కవిసమయాల్లో ప్రసిద్ధులు.

మనపురాణా లర్థవాదప్రధానమైనవి కాబట్టి వానిలోని కథలు చాలావరకు మానవజీవితానికి ప్రతీకలుగా ఉంటాయి. అందువల్ల ఆపాత్రల పేర్లకు నైఘంటుకార్థమే కాక పరమార్థంగూడ మరొకటి ఉంటుంది. అయితే ప్రస్తుతం అదిగాక మీకీ వ్యాసంలో కొన్నికవిసమయదాంపత్యాల తీరుతెన్నులు మాత్రం చూపిస్తాను.

సృష్టిలో సూర్యు డుదయించగానే కమలం విచ్చుకుంటుంది. చంద్రుడు రాగానే కలువ వికాసాన్ని పొందుతుంది. వసంతం రాగానే చెట్టు చిగిరిస్తుంది. తీగ తనసమీపంలో ఉండే చెట్టు నందుకొని అల్లుకుపోతుంది. ప్రకృతి జడమైనా దానిలోని ఈఅసంకల్పిత ప్రతీకారచర్య చూచేవరకు పరవశించిన భావుకుని హృదయం సంస్కృతభాషలో వాని పేరులకుండే లింగాన్నాధారంగాచేసికొని వానివానికి భార్యాభర్తల సంబంధాన్ని సాధించింది.

ప్రకృతిలో ఈధర్మం కొన్నిచోటుల్లో నియతంగా కనిపిస్తుంది. అలాగే సంస్కృతంలో కొన్నిశబ్దాలు నియతలింగంలో ఉన్నాయి కాబట్టి ఎక్కడప్రకృతిధర్మం శబ్దలక్షణం నియతంగా ఉందో అవి కవిసమయాలుగారూఢికెక్కాయి. ఈనియతధర్మం లేనిచోటగూడ మహాకవులు కొందరు తమప్రతిభాబలంచేత దాంపత్యధర్మాన్ని సాధించారు. ఈవిధంగా శబ్దానికి గలలింగధర్మాన్నాధారంగా చేసుకొని దంపతులను నిరూపించటం మనసాహిత్యంలోనేగాదు పాశ్చాత్యసాహిత్యంలోగూడా ఉంది. వారివాఙ్మయంలో సూర్యుడు పుంలింగం చంద్రుడు స్త్రీలింగం. అందుచేత వారు ఆయిద్దరికి దాంపత్యాన్నంగీకరించి అమావాస్య వారి సంయోగ దినంగా చెప్పారు.

సాకారసృష్టికి పార్వతీ పరమేశ్వరులాదిదంపతులైనట్లు శబ్దప్రపంచంలోని ఈ భావనాసృష్టికి మనకు ప్రకృతిపురుషు లాది దంపతులు. వ్యాకరణశాస్త్రంలో ప్రకృతి స్త్రీలింగం పురుషుడు పుంలింగశబ్దం. ఈ ప్రకృతిపురుషుల సంయోగాన్ని వేదాంతులు గూడా అంగీకరించారు.

లౌకిక వాఙ్మయంలో దంపతులుగా ఛాయాసూర్యులు ప్రసిద్ధులైతే వైదిక వాఙ్మయంలో ఉషస్సూర్యులు ప్రసిద్ధులు. ఋగ్వేదంలో దీర్ఘతముని పుత్రుడగు కక్షీవంతు డుషస్సూర్యుల దాంపత్యాన్ని వర్ణించాడు. ఈ వైదిక లౌకిక వాఙ్మయాలుగాక కవిసమయాల్లో సూర్యుని భార్య పద్మిని. వారిదాంపత్యాన్నిగూర్చి —

తనవుం గౌగిలియీవొకప్పుడును
నా ధానీకరస్పర్శనం
బున గిల్గింతలెయుంచు పద్మిని కరాం
భోజమ్మునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు గ
న్పట్టంగ నవ్వేల్గురా
యని రారాయని పిల్చెనా దగ ద్విరే
ఫాద్యంతదీర్ఘధ్వనుల్ ॥

అని చెప్పుచు చేమకూర యిందు పద్మినిని విరహార్తనుగా రూపించినతీరనుపమంగా ఉంది.

లౌకికవాఙ్మయంలో సూర్యునికొక్కతే భార్యగాని చంద్రుని కిరవయ్యేడుగురు. వారిలో అతనికి రోహిణీదేవిపైనే మిక్కిలి మక్కువంటారుగాని కాళిదాసు "చిత్రాచంద్రమసోరివ" అని అతనికి చిత్రాదేవి పైగూడ మక్కువైనట్లు సూచించాడు. చంద్రుడు నక్షత్రాధిపతేగాక నిశాపతి గూడ. నిశాశబ్దం స్త్రీలింగంగా బట్టి దానిలో సృజించిన ఈసమాసోక్తి చూడండి.

రాగమువహించి లోలతారకము నిశ మొ
గమ్ము శశిగ్రహియించె నాకరణిముందె
ఆమెతిమిరాంశుకమ్ము సమస్తముదిగ
జారినను రాగమున బోల్పజాలదెట్లు.

దీనిలో ప్రసక్తమైన నిశాచంద్రులు హరిణీశశజాతికి చెందిన నాయకీనాయకులై ఈసన్నివేశం వారిప్రథమసమాగమాన్ని సూచిస్తుంది. ఈ కల్పన జాంబవతీపరిణయంలోనిదంటారు. ఇక యితనికవిసమయసిద్ధమైన దాంపత్యాన్ని చూడండి.

మంతనంబులాయె మాటలు లేకుండ
మోహముద్రలాయె ముట్టకుండ
కలలుగాంచుటాయె కనుమోడ్పు లేకుండ

నిందలేల నాకు చందమామ :

కలువకు పుంశ్చలి అని మరోపేరు. పుంశ్చలియనగా రంకులాడి. సూర్యచంద్రులకు ప్రియులైనదిక్కాంతలకు గగనలక్ష్మికి కొంతవరకు రంకుకట్టటానికి వీలుందిగాని పాప మీకలువకన్నె ముద్దరాలు. చంద్రుని పొందుకూడా ఎఱుగదు. అందువల్ల ఆమె ఉత్తదానికే తన కీనింద లెందుకని చంద్రునే అడుగుతుంది, ఈకల్పన వెంకటపార్వతీశ్వరులది.

సూర్యచంద్రులకు కాలంలోనేకాక దిక్కులతోగూడ సంబంధముంది. దిక్కులను కన్యలుగా చెప్పటం మనపురాణసంప్రదాయం. ఈసంప్రదాయంపై చేమకూరసృజించిన ఈ అపూర్వదాంపత్యం చూడండి.

కరములొయ్యన జాచియిరుల నెరుల్ చక్క
గాదిర్చి తెల్వి సంఘటిలంగూర్చి

కడునయనచకోరికల ముద్దుగావించి
చనుజక్కవల గోళ్ళ నెనయ నాని
కళలురంజిల్లంగ తోలినాడు సనుగూడి
ఇటప్రొద్దు గ్రుంకనప్పటికి రేపు
వడివచ్చినిలతు నీకడలు నేటికిజాలు
ననియేగుటను జేసి యవ్విధమున
తామరలనిక్కవమ్ముగ తనవు ముదము
లతిశయిల్లగ వేవచ్చి యపుడు నిల్చె
తమి విటుడుతూర్పు లేదిక్కు కామిరెవయసు
బిత్తరి మొగంబునను బొట్టువెట్టినట్లు.

పతిదగ్గరకు వెళ్ళునదేగాదు. పతిని తనదగ్గరకు రప్పించుకొనునది కూడ అభిసారిక యే యని సన్నిధానంవారు చెప్పారు. కాబట్టి ఈ 'తూర్పులే దిక్కు కామిర వయసు బిత్తరి 'అభిసారిక', ఇదే విధంగా

తరుణుండగు శీతలకరు
మరిగి వియల్లక్ష్మి తన్నుమాని ముసుకడున్
ఖరకరుడు నను చుద్రొబ్బిన
కరణిన్ రవి పశ్చిమాద్రికడఁ గ్రుంకెన్ నృపా!

అను పద్యంలో చెప్పబడిన వియల్లక్ష్మి పుంశ్చలి.

సూర్యచంద్రులకు పురాణాల్లో వేరు వేరు భార్య లున్నా వారు కావ్యప్రపంచంలో దిక్కన్యలతో వియల్లక్ష్మితో, కాలకన్యలతో, జలదాంగనతోనే కాపురంచేశారు. కాలప్రసక్తి వచ్చింది గనుక ఇక్కడ దైవగతికి గురియైన ఓ దంపతు లను చూడండి.

సంధ్యఅనురాగ విలసన సాహసికయె
దివసమును తత్పరస్పర స్థితినియతమె
అహహా! ఇట దైవగతి విచిత్రాతిచిత్ర
మాయుభయులకు లేదుసమాగమమ్ము!

సంస్కృతంలో సంధ్యాశబ్దం స్త్రీలింగం. అంతేకాక అది రాగవిలసితం. దానిపై ఏర్పడిన చమత్కార మిది. పాపం! ఈ దంపతులను చూస్తే జాలివేస్తుంది.

పురాణాల్లో భూదేవి శ్రీమహావిష్ణువు భార్యగాని వైదికవాఙ్మయంలోద్యావాపృథివీదేవతలు దంపతులుగా దర్శనమిస్తారు. వీరి దాంపత్యాన్ని -

'భూసతికిన్ దివంబునకు
బొల్పె సగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె'

అని నన్నయగారు తప్పఇంతవరకు ఈవిషయం మరెవరూ చెప్పలేదు. ఈదాంపత్యాన్నే కాదు. ఆయన 'చనబేడికి దారక్రియ' అనిమరో అపూర్వదాంపత్యాన్ని గూడ చెప్పాడు. పేడికి వివాహమే అసంభవం. అథవా శిఖండి న్యాయంగా ఎక్కడైనా జరిగినా ఇక్కడ నన్నయగారు వాడినవిశేషవాక్యాలుచూస్తే వారి దాంపత్య సారస్యం తెలుస్తుంది.

పేడిఅచ్ఛికపదం. అచ్ఛికా లన్నీ స్త్రీ సమూ లని సూరి నిర్ణయం. దారాశబ్దం సంస్కృతంలో పుంలింగం. కాబట్టి ఇలాంటిదాంపత్యాల్లో మొగుడు పెండ్లాము వలె పెండ్లాం మొగుడివలె వ్యవహరిస్తారని నన్నయగారి సూచన. అంతేకాదు దారాశబ్దానికి బెదిరించున దనే వ్యుత్పత్తి కూడా ఉందికాబట్టి. ఈలాంటి దాంపత్యాలలో తఅచుపెళ్ళాం మొగుణ్ణి బెదిరించుకొంటుం దని మరోసూచన. నన్నయగారు చూపిన ఈరెండు దాంపత్యాలు ఆయన వైదికవిజ్ఞానానికి లోకజ్ఞతకు అపురూపమైన మచ్చులు.

సముద్రానికి సరిత్పతి అనే పే రుంది. సరిచ్ఛబ్దం సంస్కృతంలో స్త్రీలింగం. గంగాకావేరి మొదలైన సరిత్తుల్లో తుంగభద్ర పేర్కొనబడకున్నా అది పంచగంగల్లో ఒకటి. ఈనది విశేషించి తెలుగుదేశంలోనిది. ఇది నేరుగా సముద్రుని చేరకపోవటం తెనాలికి ఒక గొప్ప వెలితిగా తోచింది. అందువల్ల దాన్నిగుఱించి -

గంగాసంగమ మిచ్చగించునె మదిన్
కావేరి దేవేరిగా
నంగీకార మొనర్చునే యమునతో
నానందముం జెందునే
రంగత్తుంగ తరంగ భంగములనా
రత్నాకరేంద్రుండు నీ
యంగం బంటి సుఖించునే నిని గుణభ
ద్రా తుంగభద్రానదీ !

అని మృదులంగా చెప్పి తన ప్రతిభాబలంతో తుంగభద్రకు గల వెలితిని కప్పివేశాడు. ఇవన్నీ మన కవిసమయాలు.

ఆగమదాంపత్యాలు:- లతాశబ్దం స్త్రీలింగం. తరుశబ్దం పుంలింగంగాబట్టి కావ్యలోకంలో లతాతరుదాంపత్యం బాగా అల్లుకుపోయింది. అయితే మన కీపాదపదాంపత్యం క్రొత్తగాదు. వైదికకాలం నుండే ఉంది. వైదికకర్మలైన యజ్ఞాదుల్లో జమ్మిరావికఱ్ఱలను రాపిడిపెట్టి నిప్పుపుట్టిస్తారు. సంస్కృతంలో శమీశబ్దం స్త్రీలింగం అశ్వత్థశబ్దం పుంలింగం కాబట్టి ఈజంట యజ్ఞకర్మకు కారణమైన ఆదిదంపతులుగా నిలిచింది.

కాళిదాసు శాకుంతలంలో బాలసహకార వనజ్యోత్స్నలదాంపత్యాన్ని సృజిస్తే అది చూచి తిక్కనగారు 'పెనుపొదుట నిడిన చూతంబును నవమల్లికయు బోలె' అని చూతనవమల్లికా దాంపత్యాన్ని చూపాడు. సహకార చూతశబ్దాలు రెండూ పుంలింగాలే అయినా శకుంతల ఆశ్రమకన్య గాబట్టి కాళిదాసుకు వనజ్యోత్స్నకు దానికి సహకారంగా సహకారం కావలసి వచ్చింది. ఇక తిక్కనగారి ఉత్తరాభిమన్యులటుల గాదు. ఇద్దరూ నాగరికులు కాబట్టి అనురూపధర్మా న్ననుసరించి ఇక్కడ చూతానికి నవమల్లిక కావలసి వచ్చింది. ఈ 'మల్లమ్మ మామిడన్న' లను చెబుతూ తిక్కనగారు 'చూతం చ నవమల్లికా !' అని వెంటవెంటఉండే మన్మథుని బాణాలు జ్ఞాపకంచేసి ఆ దంపతుల శృంగారానికి ఉత్కర్షను చేకూర్చాడు. ఈలాంటి దాంపత్యాలు మన కావ్యాలలో ఇంకా చాలా కనిపిస్తాయి. పెద్దనగారు -

అపరిమితానురాగసుమ
  నోలసన్మయి చిగురాకు చేతులం
దపసిని కౌగలించె వని
  తాయిదె జూచితే రంభ –

అని రంభాతాపసుల పరిష్వంగాన్ని చెప్పాడు. ఈ మర్యాదను గ్రహించి చేమకూర –

ఇన్నాళ్ ప్రోదియొనర్ప కేళివనిలో
  నింపొందు నమ్మాధవీ
పున్నాగంబుల పెండ్లిసేయవలె పూ
  బోండ్లార రారే!

యని సుభద్రార్జునుల మిషపై 'వాసంతీ పున్నయ్యా' లను చూపించాడు. శ్లేషలకు, చమత్కారాలకు భట్టుమూర్తిది అగ్రతాంబూలం. సంస్కృతంలో నదులు స్త్రీలింగాలు, పర్వతాలు పుంలింగాలు; గాబట్టి అతని చేతిలో శుక్తిమతీనది కోలాహలపర్వతం ప్రాణంతోపాటు పురుడుకూడా పోసుకొన్నాయి. కళాపూర్ణోదయం కథకూడా యించుమించీలాగే ఉంటుంది.

విసమయదాంపత్యాలు :—

ఇంతవరకు చూచినవి కవిసమయాలు. ఇక కొన్ని విసమయాలుకూడా చూడండి. వానిలో కళాపూర్ణోదయం మొదటిది.

ఈనాడు మనకు రామమ్మ సీతయ్యా, చంద్రమ్మ చుక్కయ్యా అనే ఆలుమగల పేర్లు వింటే నవ్వురాదుగాని, పొలయలుక పొందిన భార్యను ప్రసన్నురాలిని చేసికొనేటందుకు బ్రహ్మదేవుడు కల్పించి చెప్పినకథలో కళాపూర్ణుని తలిదండ్రుల పేర్లు కాస్త తారుమారయ్యే సరికి సరస్వతికి నవ్వాగిందికాదు. ఆకథలో కళాపూర్ణుని తండ్రిగా బ్రహ్మచెప్పిన సుముఖాసత్తి ఓకొలను. తల్లిగా చెప్పిన మణిస్తంభుడు ఓరత్న స్తంభం.

ఆకథను చెప్పినపుడు బ్రహ్మ తన భవనారామంలో కాంచన సోపానాలుకట్టబడిన సరసికి తూర్పున తలిరుపాన్పుపై ఉన్నాడు. ఆసరసినడుమ కృతకమరాళాలతోగూడిన ఓమానికపుకంబం ఉంది. మదనోద్దీపితమైన ఆసమయంలో పతివలన జరిగినప్రణయాపరాధంచేత సరస్వతి అలిగి అతని కనభిముఖియై కూర్చుంది. అప్పుడామెముఖబింబం సరస్సులో పడి, దానిలోనుండి మానికపుకంబంలో ప్రతిఫలించి ఆమె అతని కనభిముఖంగా ఉన్నా అభిముఖంగానే కనిపించసాగింది. అంత బ్రహ్మ ఆమె నోదార్చటానికే దీ పాలు పోక తమపెంపుడు చిలుకను మధ్యస్థంగా పెట్టుకొని తనకు మణిస్తంభంలో కనిపించిన ఆమె ముఖంపై ఓకథ మొదలేసి "అనగాఅనగా కళాపూర్ణుడని ఓరాజు" అని ఆరంభించాడు. కొంతసేపటి కది తనపైనే అని గ్రహించిన సరస్వతి తమచిలుకచే ఆరాజు తలిదండ్రుల పేరడిగించింది. ఆప్రశ్నకు బ్రహ్మ కండ్లు తెఱచాడు.

జీవుడు మొదటపురుషగర్భంలో ప్రవేశించి అక్కడనుండి స్త్రీగర్భంలో చేరుతాడు. ఇక్కడ సరస్వతిముఖబింబం ప్రవేశించినసరస్సు దానిలోని స్తంభం రెండూ స్త్రీలింగేతరాలే. కల్పింపదలచుకొంటే వానిలో స్త్రీలింగరూపం సరశ్శబ్దానికే సాధ్యంగాని అది పితృస్థానంలో నిలచింది. బ్రహ్మ ఈచిత్రానికి కాస్త తడబడ్డా ప్రేయసీప్రియులు పరస్పర మలరించుకోవటంలో "అదీఓచొప్పు" అనే కళారహస్య మెరిగిన అతడు ఆడపేరుతో తండ్రిని మొగపేరుతో తల్లినిచెప్పి మరోక్రొత్త దాంపత్యాన్ని సృజించాడు. ఇదేగాక యితడు దానిలోనే —

ఉదకముగ్రోల వ్రేలెడి ప
  యోదము పౌరుష కేళిసంభ్రమా
భ్యుదయగళ ద్రమాకబరి
  పోలికనొప్ప తడిద్విలాసముల్
తదభివృతాంగకస్ఫురణ
  లందలపింపగనీపయోధిరొ
ప్పిదము శయించినట్టి ముర
  భేది తెఱంగు వహించె జూచితే!

అనితటిత్పయోదదాంపత్యాన్ని, తడిస్మరభేదిదాంపత్యాన్నికూడా సృజించాడు. దీనికంటె మొదట తటిన్మేఘదాంపత్యమే ప్రసిద్ధంగా ఉంది. ఈలాగే భట్టుమూర్తి లతలసంబంధం తరువులతోడనే అయినా

ఒనరహిమావగుంఠనము
  లూడ్చి తెమల్చినపత్రభంగముల్
సన నసియాడుచున్ మొగడ
  చన్నులుపల్లవపాణి గప్పు నూ
తనలతికాలతాంగుల ను
  దారగతింజలివాపి సెయ్యపుం
బెనకువ నేర్పె దక్షిణస
  మీరణుడొయ్యన తావు లంటుచున్.

అని సమీరణునితో గూర్చి అతని దక్షిణనాయకత్వాన్ని నిరూపించాడు. ఇపుష్పాలకు భ్రమరాలకు ఉండే సంబంధ విడదీయరానిది. అందువల్ల మల్లికా, మాలతీ, కేతకీ పుష్పాల నెన్నిటిని చెప్పినా పద్మాన్నెవరూ చెప్పలేదు. పద్మానికి సూర్యునితోడనే జత అయినా వరాహపురాణకర్తలు –

ఎడపనికూర్మితోడ రమి
యించి వృథా కలహించి వాసిపో
యెడుతరి కామినీకరగ్ర
హీతపటాంచలుడైన భర్తకె
వడి మునిమాపుదాక మధు
వారి యథేష్టముగాగ నాని వె
ల్వడుచు పెనంగె నేటి మురు
శక్కుమలగ్రసితాగ్రపక్షమై.

అని కమలా భ్రమర (తేటి) దాంపత్యాన్ని చెప్పారు. భూదేవికి ద్యుదేవతతోడనే జతగాని పోతనగారు

చెలువుడు ప్రావృట్కాలుడు
పొలసిన పులకించుభూమిపులకము లనగా

అని భూప్రావృట్కాలుల దాంపత్యాన్ని చూపాడు. అంతేకాక అతడు గజేంద్రమోక్షంలో సరోవరలక్ష్మీ మదగజేంద్రుల దాంపత్యాన్నిగూడ చెప్పాడు. ఇవన్నీ కవిసమయాలే అయినా మహాకవులు శబ్దగతలింగాన్నాధారంగా చేసికొని వీటిని నిరూపించారు.

ఈవిధంగా కొంతస్పష్టంగా చెప్పినవే కాక —

'వాగర్థావివసంపృక్తౌ' — 'శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్' అనునట్టి వి సంస్కృతంలో, మృగమదము చెంత కుంకుమ రేఖవోలె, (కస్తూరి — కాంతయ్య) నీలమణిచెంత నుదిరిపోన్ రేఖవోలె (మ కొమ్మ — బంగారయ్య)

అని తెలుగులో ఉపమాప్రాయంగా సూచించిన దాంపత్యాలింకా చాలా ఉన్నాయి. కాబట్టి వానిని పరిశీలించినపుడు ఈలాగ వానివెనక ఉండే కావ్యధ్వనులు, ఆయాకవుల ప్రతిభా విశేషాలూ ఎన్నో తెలిసివస్తాయి.

---

# కద్రూ వినతల [illegible]
# కొన్ని ప్రసన్న విశేషాలు

— భాషాప్రవీణ శ్రీ మైలవరపు శ్రీనివాసరావు, ఎం. ఏ.

లలితకళలలో కవిత్వం ఉత్తమమైనది అన్న ఆ మాట సామాన్యమైనదికాదు. అది అంధ, బధిర, మూకాది సమస్తవికృతాంగులనీ, నిరక్షరాస్యుల్నీ కూడా అర్థంచేయించుకొనేలా చేసుకుని ఆనందాన్ని ప్రసాదించే అద్భుత శక్తి కల అద్భుతచైతన్యశక్తి. ముఖ్యంగా నన్నయది ఆఖ్యానశైలి కావడం మన అదృష్టం. ఒకకథని నన్నయ చెప్తూ వెళ్ళిపోతూంటాడు! అతడొక కథ చెప్తూవెడుతూంటే వెనకగా మరోకథ ప్రసన్నం అవుతూ ఉంటుంది. ఆ ప్రసన్నం అయే కథలో మనం అలా ఊకొట్టుకుంటూ, మాటలలోమాట అనుకుంటూ, ఎలాగో తెలియకుండా వెళ్ళిపోతూంటాం. మధ్యమధ్య చిక్కులు వస్తూంటాయి. కానీ మనపరిశీలనాదృష్టి పెడితే అక్కడ మహావిశేషం గోచరిస్తూంటుంది. ఈ అద్భుతరచనాశిల్పాన్ని కద్రూవినతల ఘట్టాన్ని ఆధారంగా చూపించాలనేది నా ప్రయత్నం. అతడు పట్టిన ప్రతి ఘట్టమూ అంతటి శిల్పసంపదని తప్పక కల్గిఉంది. ఇది అతిశయోక్తి కానేకాదు.

కద్రూవినతల కథ చూస్తే చాలా చిన్నది. 'కద్రూవినత లిద్దరూ సవతులు. పిల్లలులేక కశ్యపుణ్ణి ఆరాధించారు. ఆయన ప్రత్యక్షమై వారివారి కోర్కెల ప్రకారం కద్రువకి 1000 మందిని, వినతకి ఇద్దర్నీ ప్రసాదిస్తాడు. వారిద్దరూ గర్భాలని ధరించి అలా గ్రుడ్లని కంటారు. కద్రువకి పిల్లలుకల్గుతూంటే, ఎంతకాలానికీ వినతకి కల్గకపోతూంటే బాధకల్గి వినత ఓ గ్రుడ్డుని చిదిపింది. అనూరుడనే వాడు జన్మించి, పూర్ణదేహం రానీయకుండా చేసినందుకు వినతకి శాపం ఇస్తాడు. కొంతకాలానికి గరుత్మంతుడు రెండోగ్రుడ్డునుంచి జన్మిస్తాడు. ఈలోపులో కద్రువకి అధర్మబద్ధంగా వినత దాసీ అవుతుంది. దాస్యం తొలగాలంటే గరుత్మంతుణ్ణి అమృతం తెచ్చియిమ్మని కద్రువపిల్లలు అడుగుతారు. గరుత్మంతుడు అమృతాన్ని తెచ్చి దాస్యం పోగొడతాడు'—ఇంతే సామాన్యకథ. దీనియందలి అంతర్వాహినిని పరిశీలిద్దాం.

కద్రూవినత లిద్దరూ పుత్రార్థినులై కశ్యపుణ్ణిఆరాధించారు. మీకోరినవరంబు లిచ్చెద వేడుం డన్నాడు. అంతే.

'అనలతేజులు దీర్ఘదేహులు
నైన యట్టి తనూజులన్
విమలసత్త్వులఁ గోరెఁ గద్రువ
వేవురం గడు వేడ్కతో
వినత గోరె సుపుత్రులన్ భుజ
వీర్యవంతుల వారికం
టెను బలాధికులైనవారిఁగ
డింది వీరుల నిద్దఱన్'— (2/3)— అని కోరుకున్నారు.

మొదట కోరింది కద్రువ. పెద్దది కాబట్టి వయస్సులోనూ కాస్తపలుకుబడిలోనూ. ఆవిడఅనలతేజులు (సూర్యునితో సమానతేజస్సు కలవారు) దీర్ఘదేహులు (పొడుగాటి శరీరం కలవారు). విమలసత్త్వులు (కొనియాడదగిన బలంకలవారు) అయినవాళ్ళని వెయ్యిమందిని (మందిబలం కావాలని) కోరుకుంది. వినత భుజవీర్యవంతులు— కడిందివీరులు— వారికంటె బలాధికులైనవారిని ఇద్దర్ని కోరింది.

కద్రువ తనూజులని కోరితే
వినత సుపుత్రులని కోరింది.
కద్రువ దీర్ఘదేహులని కోరితే
వినత భుజపరాక్రమంకలవాళ్ళనికోరింది.
కద్రువ అనలతేజుల్ని కోరితే
వినత కడిందివీరులని కోరింది.
కద్రువ వెయ్యిమందిని కోరితే
వినతవారికంటెబలాధికుల్ని ఇద్దర్నే కోరింది

అయితే ఇద్దరూ పుత్రార్థినులే. (నన్నయ వాళ్ళిద్దరి కోరికల్నీ సమానం గా రెండేసి పాదాల్లో వ్రాయడం అదో విశేషం). సహజమైన స్త్రీ స్వభావాన్ని బట్టి మాతృత్వం కోరుకోవడం ఉచితమే కానీ ఈలాగ వరాలు కోరుకోవడంలో అంటే కద్రువకోర్కె ప్రతీదానికీ, జాగ్రత్తగా ఆలోచించి ఎక్కువగా మార్పులనిచేసి వినతకోరుకోవడంలో వారిద్దరి మధ్యా ఉండే అసూయ అస్పష్టంగా ప్రత్యక్షంగా కన్పిస్తోంది. తన పుత్రులకంటె ఇతరుల పుత్రులున్నతిలో ఉన్నారంటె స్త్రీ స్వభావం అసలు సహించదు. ఈ విషయం మిగతా వాటిల్లో అంతవాచ్యంగా లేకపోయినా సుపుత్రులూ-వారికంటె బలాధికులూ అయిన వాళ్ళు కావాలని వినత అనడంలో గోచరిస్తుంది. వెయ్యిమందిని కద్రువా-అసూయతో ఓ రెండువేలమందిని వినతా కోరి ఉంటే అంతవరాన్ని ప్రసాదించే శక్తి నాకులేదని చివరికి కశ్యపుడు శాస్త్రం చెప్పిపోతే 'బహ్వారంభో లఘుక్రియా' అయిపోతుందని, ఒకవేళ కద్రువ అడిగిన వెయ్యిమందినీ ఇచ్చినా ఇయ్యకపోయినా తనకి మాత్రం ఇయ్యాలనీ, తనకేమైనా పుత్రుల్లుండి తీరాలనీ వినత ఇద్దర్ని మాత్రమే ముచ్చటగా కోరుకుంది. ఈ కోరుకోవడాన్ని తరల పద్యంలో చూపాడు నన్నయ. ఇంచుమించుగా తరలపద్యం ప్రార్థనా సమయాల లోనే వాడబడింది. రురుడు డుండుభమనే పాముని చంపబోతే అపాముఅతణ్ణి 'ఏమికారణమయ్య ? పాముల కేల యల్గితి ?...' అనే మత్తకోకిల పద్యం లో వలదని ప్రార్థిస్తుంది. ఈపద్యం సరే సరి. అలాగే దేవయాని యయాతిని 'అమరసన్నిభ-ఏనుఘోరసురాసురాహవభూమి...అనేతరల పద్యంలో తనని గూర్చి ఆభిజాత్యంతో పల్కి ఉద్ధరించి రక్షింపుమని వేడుకుంటుంది. ఇలా పద్య చమత్కారమూ ఉంది. ఈపద్యాలగమనం వేడుకుంటున్నట్టే ఉంటుంది.

ఇలా పోటీలుపడి కోరుకున్న ఇద్దరూ గ్రుడ్లుపెట్టారు, ఎవరి గ్రుడ్లనివాళ్ళు రక్షించుకుంటున్నారు. అయితే 500 ఏళ్ళకు కద్రువ గ్రుడ్లు (తరతరంబ అవిసినన్ ...) మెలమెల్లగా పిల్లలు కాసాగాయి. తరతరంబ అవియడంలో ఓ పెద్ద విశేషం ఉంది. అప్పుడప్పుడు-అప్పుడప్పుడు కద్రువగ్రుడ్లు పిల్లలుగా అవుతూంటే, పాపం వారికంటెను బలాధికులయిన వారిని కోరుకున్న వినతకి పిల్లలే, పిల్లవాడే కరువయ్యాడు. అనేకసహస్ర సంవత్సరాలు తపస్సుకి పట్టింది. పోనీ అనుకుంటే 500 ఏళ్ళు పిల్లలుగా మారడానికి పట్టింది. పోనీ అని సరిపెట్టుకుందామా అంటే ఆ పిల్లలు తన వాళ్ళూ కారు. ఓ ప్రక్క కద్రువకి పిల్లలు కలుగుతూంటే తనకి ఏ ముద్దూముచ్చటా లేకుండా ఉండడం నిర్వేదహేతువైంది పతి ఎక్కడో తపస్సులో ఉంటాడు. పిల్లలా లేరు.

తనకున్న ఆశ మొత్తం, ఎప్పుడో పిల్లలౌతారేమో అనుకొనే రెండుగ్రుడ్లు: పోనీ కద్రువగ్రుడ్లు అన్నీ ఒక్కసారి పగిలి పిల్లలైపోతే వినత దుఃఖం ఒక్కసారి పొంగిచల్లారేదేమో-లేదా తనగ్రుడ్లు కూడా ఒకేరోజున పగిలి నయనానందకరులు ఇద్దరూ ఇంట్లో ఒకరోజునించే తిరుగుతారని చాలా సంతోషపడేదేమో-కానీ కద్రువకి అప్పుడప్పుడు పిల్లలుకల్గడం-వినతకి క్షణక్షణదుఃఖంకల్గడం-ఒక పెద్దహేతువై పోసాగింది. వారినామకరణాలు కూడా ఐపోయాయిట. (శేష-వాసుకి ... మొదలుగావేవురు నాగ ముఖ్యులు అనడంలో విశేషంఇదే-దీంట్లో జంతుశాస్త్రానికి సంబంధించిన విశేషాలూ ఉన్నాయి. మచ్చుకి ఒకటి చూస్తే-కొన్ని పాములు ఎలకలని తినవు. కొన్ని తింటాయి. ఇవి (తినేవి) మూషికాద జాతికి చెందినవి. ఆ పేరుగలవాని సంతాన మన్నమాట. కొన్నింటికి పొట్ట లావూ - తలాతోకా సన్నగా ఉంటాయి. ఇవి కుండోదరనాగ సంతాన మన్నమాట. ఇలా ఆనామకరణాలనిబట్టి పరిశీలిస్తే నేటి నాగాలన్నీ దాంట్లో చూపబడ్డాయి. అన్నిపాములూ ఒక జాతికి చెందినవికావని పాపం పాశ్చాత్యులు చెప్పారు కాబట్టి మనవాళ్ళూ వీటినే నమ్మినవారు కొందరు నమ్మక తప్పదు. ఇలా చాలా వ్రాయవచ్చు. మరోసారి పరిశీలిద్దాం)

ఇలా నాగముఖ్యులంతా జనించేసారు. ఇక వినతకి పుట్టెడు దుఃఖం వచ్చింది. శోకమనే స్థాయీ భావం ఆమెలో ప్రవేశించింది. తాను ఆలంబనవిభావం. రోజురోజూ కద్రువకి పిల్లలు కల్గడం ఉద్దీపనహేతువు. పైగా కద్రువపరిచారిక లంతా వినతని ఎగతాళి చేసికూడాఉండ వచ్చు. 'మహా గొప్పవాళ్ళు అయిన పుత్రులని కోరుకుంది - పూర్తి గొడ్రాలైంది'- అని ఈలాటి స్త్రీస్వభావసంభాషణాలు జరిగి ఉండవచ్చు. అంచేత ఆమె 'లజ్జావనతవదన' అయిందిట. సిగ్గు చేత తలదించుకొన్నది. ఈ తలదించుకోవడం దుఃఖాతీతస్థితిని తెలియచేస్తుంది. ఇది అనుభావం. 'విగతధృతిన్ ...) ధైర్యం పూర్తిగా చచ్చిపోయి ఆమె గ్రుడ్డుని పగల గొట్టిందట. అంటే తనవశాన్ని తాను తప్పింది. తనంతతాను చిదుపడం పొరపాటని వినతకి తెలియక కాదు తనవశంతప్పడం వల్ల. అంటే ప్రళయమనే సాత్త్వికభావం కల్గింది. (ప్రళయ స్సుఖదుఃఖాద్యైర్గాఢ మింద్రియమూర్ఛనమ్) తదనుసారంగా పిల్లలు

కల్గరేమో అనే నిర్వేదం కూడా జనించింది. ఈసాత్త్వికి సంచారి భావాలకి అసలుక్షణం వ్యవధికూడా లేకపోడంతో మహాకరుణ మావిర్భవించింది. అంతే గ్రుడ్డు చిదిపింది. నన్నయ ఇలా రసాన్ని దీంట్లో అంతర్లీనం చేశాడు. ఆ గ్రుడ్డుని చితిపిందన్న పద్యం ఇది.

'తన గర్భాండంబుల రెం
టను బ్రియనందనులు వెలువడమి నతిలజ్జా
వనతయయి వినత పుత్రా
ర్థిని యొక యండంబు విగతధృతి
నవియించెన్॥ (2/5)

ఆమెపుత్రార్థిని అనికూడా విశేషణం వేయడంలో పైవిశేషం అంతా సహజం అన్పించక మానదు. అలాగే ఈ 'విగత ధృతి' అనే పదంలో కూడా ఎంతో అర్థాన్ని చెప్పవచ్చు. పిల్లలు కల్గుతారా_ కల్గితే ప్రియనందను లేనా? అయితే ఇంతకాలం ఎందుకకలగలేదు? అయినా చిదిపి చూస్తే తెలుస్తుందనే ఆసక్తి_ఆసక్తి వెనుక అస్పష్టంగా భయం_భయంలో ఓ ధైర్యం_ఇలా అన్నిభావాలూ కలిసి నిర్వేదానికి దారితీసాయి. తానెలా అని ష్టాన్ని ఊహించుకుంటూ భయంతో చిదిపిందో అలాగే_

దానన పరార్థకాయవిహీనుఁడు_ పూర్వా
ర్థతనుసహితుఁ డరుణుఁ డనం
గానుదయించె సుతుండు మ_హానీతియు

తుండు తల్లికప్రియ మెసఁగన్ (2 16) ఉదయించాడు. ఎలాగూ అనిష్టాన్ని ఊహించుకుంటోందేమో కాబట్టే పద్యం కూడా అపరార్థంలేని, పూర్వార్థం మాత్రమే కలవాడు పుట్టాడని వ్రాయడం జరిగింది. గ్రుడ్డు చిదపఁగానే శరీరంపైకి వస్తూంటే పూర్వశరీరాన్ని చూస్తూ మహానందాన్ని పొందుతూన్న ఆమెకు, దీర్ఘదేహమేఅని సంతృప్తిచెందుతున్న ఆమెకు ఊరువులనించీ శరీరంలేని వికలాంగుడు జన్మించాడనిపించేసరికి మహాదుఃఖం కల్గింది. పూర్వశరీరం ఉన్నా, అపరశరీరం లేదు. అయితే అపరశరీరం లేదని ముందుగా పద్యారంభంలో చెప్పడంవలన వినతకి ఆనందంకంటె దుఃఖమే హెచ్చింది దని తెలుస్తోంది (తల్లి కప్రియ మెసగన్) అసలు పిల్లలు లేకపోవడం ఒక దుఃఖహేతువు. పుట్టినవాడుకూడా అపరార్థకాయవిహీనుడై వంశకర్త కాలేకపోవడం మరోదుఃఖహేతువు. వీనితో ఈవంశం సరి. వైనతేయు లుంటూరా? అని అనుమానంకల్గింది. అతడు అనూరుడుగా నిర్ణయింపబడ్డాడు. 'నన్ను సంపూర్ణ శరీరుంగానీక యండం బవియించిన యవినీతవు గావున నీవు నీ సవతికి దాసివై యేనూఱేం డ్లుండు మని శాపం బిచ్చి యింక నీ రెండవయండంబు తనకుఁ దానయవియునంతకు నుండనిమ్ము_ అందుఁ బుట్టెడు పుత్రుండు మహాబలపరాక్రమ సంపన్నుండు నీ దాసీత్వంబు వాపునని చెప్పి...' వినుతకావలసిన వినత లజ్జావనత కావడమే కాక అవినీత కూడా అయింది.

తన కోరికప్రకారం పుట్టిన వుపుత్రుడు తనని 'అవినీత' అనడమే కాకుండా, తన్ను దానిగా ఉండమని శపించాడు. పైపెచ్చు తన సవతికే దాసీ కమ్మన్నాడు. వినత అహంకారం పూర్తిగా నశించింది. నిర్వేదమూర్తి అయింది వినత. నీసవతికి నీవు 500 ఏళ్ళు దాసీగా ఉండు _ నీకు పుట్టబోయే కొడుకు దాసీత్వం తొలగిస్తాడూ అంటే నీకింకా 500 ఏండ్లకికానీ కొడుకు పుట్టడని భావం. నన్నయ యీల మెలికలు మలకలుగా రాస్తాడు. అలా రాయడం లోనే చమత్కారం ఉంది. ఉంటుంది కూడా. అయితే ఇలా గ్రుడ్డుని చిదపడం_ శాపం ఇవ్వడం ఇవన్నీ వినత కొక్కతెకే తెలుసు. కద్రువకి కాని, కద్రూసఖులకి కాని తెలీదు. (ఈ విషయాన్ని ముందు స్పష్టంగా నిరూపించే అవకాశం వస్తుంది) అదీకాక వినత అసలు చెప్పనేచెప్పదు.

ఇక ఈలా పుట్టడంలో జంతుశాస్త్ర రహస్యం ఒకటి దాగిఉంది. కద్రూ వినతలిద్దరూ కశ్యపప్రజాపతి భార్యలు. సవతులు. ఇద్దరూ గర్భాలని ధరించారు. జంతుశాస్త్రాన్నిబట్టి, చెవులున్న ప్రతిప్రాణీ పాలనిచ్చి తీరుతుంది. వీళ్ళిద్దరూ చెవులున్న ప్రాణిజాతికి సంబంధించిన వాళ్ళు కాబట్టి పాలనిచ్చి పెంచాలికదా! కానీ మరి పాములనుకన్న కద్రువకానీ, అనూరు గరుత్మంతులను కన్న వినతకానీ పాలిచ్చి పెంచలేదు. ఆ అవకాశమూ రాలేదు. మరి ఇదెలా పొసగుతుంది? అని ఒక ప్రశ్న. పైగా ఇద్దరూ ఒకే కశ్యపప్రజాపతి వరంవల్ల పిల్లల్నికంటే అప్పచెల్లెళ్ళవరసైన వీళ్ళకి ఒకేజాతి సంతానం కలగాలికదా అని మరోప్రశ్న. సావధానంగా పరిశీలిస్తే పాములకు కద్రువ పాలనిచ్చి పెంచలేదు. అందుకే వాటికి పాలంటే ఇష్టత ఉండిపోయింది. పైగా నేఁటి జంతుశాస్త్రపరిశోధనలనిబట్టి తల్లి ఆహారపు టలవాట్లు తమ సంతానానికి రావలసిన అగత్యంకూడ లేదని తేలింది. చాలా సంతానాలు దీనికి ఉదాహరణ ప్రాయాలుగా ఉన్నాయట.

ఇది ప్రథమప్రశ్నకు సమాధానం. ఇక రెండప్రశ్నకు_వాళ్ళిద్దరూ స్వయానాఅప్పచెల్లెళ్ళుకారు. అంచేత ఒకేజాతి సంతానం రావాల్సిన అవసరంలేదు. అదీగాక కశ్యపవరప్రభావం వల్ల జనించిన సంతానంగానీ, అది సామాన్యదాంపత్యహేతుక సంతానంకాదుగదా! ఇలా చెప్పాక మరో అనుమానం కల్గవచ్చు. కాని వినతకి పుట్టిన ఇద్దరూ ఒక సంతానజాతికి చెందినవారు కారుగదా? అని. ఒకరు మనుష్యజాతికి, మరొకరు పక్షిజాతికి గదా అని. నిజమే. క్షేత్రాన్ని బట్టి సంతానం కలగాలి. కానీ జంతుశాస్త్రాన్నిబట్టిచూస్తే గతించినకాలాల్లో కొన్ని లక్షణాలతోఉన్న జీవరాసులు ఎన్నో నేటికాలానికి మారాయి. అలానే ఇప్పటి లక్షణాలతో పైకాలాల్లో ఉండవు. పైగా ఒక జాతినించి వేఱొకజాతి

ంతానం కూడా వస్తుంది. ఆధునికులు ిశీలించిన పద్ధతినిబట్టి సక శేరుకాలంలో ాది ఒకజాతి) చేపనుంచి తాబేలు, తా ిలునుంచి పక్షి, అందునుంచి కంచేలు లాగ పోనుపోను కోతి దాన్నుంచి మా వుడూ వచ్చారని తెలుస్తోంది. అలా రూపించారు కూడా. ఈ విషయమే క్కడ సంతానభేదం చూపిస్తుంది. మరి దేవిషయం తృతీయాశ్వాసంలో కూడా ాపబడింది. తామ్రకు పుట్టిన కాకి, ్యని, ఖానీ మొదలైన ఐదుగురకూ శ్యేన ులూ, కాకులూ, ఖాసగృధ్రాదులూ ుట్టినవిఅని (71). పైపెచ్చు దీనికి సృష్టి ర్త బ్రహ్మ. ఇందువలన పురాణాలలో ాయబడిన విషయం స్వకపోల కల్పితం ానీ, సత్యదూరంకానీ కాదు మన మె ాటి దుఃస్థితిలో ఉన్నామంటే ఏవిషయ ునా పాశ్చాత్యులు చెప్పితేనే నమ్మ ా మనేంతటి స్థితిలో. మనమేదైనా మ్మడానికి తటపటాయిస్తున్నామంటే ాళ్ళు పరిశోధించలేదనే అర్థం. శంఖం ో పోస్తేనే కాని మంటి తీర్థం కాదనికదా ా మెత ! కాబట్టి పురాణేతిహాసాల్లో ెప్పబడిన విషయాలన్నీ యథార్థాలు. ునకీ తగినంత పుస్తకజాతాన్నీ, (మన ంచి అపహరించుకుపోయిన పుస్తక ాతాన్నీ) ఆర్థిక ప్రోత్సాహాన్ని ఇస్తే అంతకంటె మేధావులులేని దేశం కాదు ాదా!) వాళ్ళకంటె ఎక్కువగానే విష యాలని గ్రహించగలము. కానీ ఆ అవ కాశాన్ని వాళ్ళు ఇవ్వకుండా మనలో Infiriority Complex) అల్ప వృత్తిని తెచ్చుకొనే స్థితిని కల్గింపచేస్తు న్నారు. ఈ విషయంగూర్చి ఎంతైనా వ్రాయవచ్చు ఉదాహరణలతో, తగిన ఋజువులతోకాని ప్రస్తుతాని కది అప్రస్తుత మని విరమిస్తున్నాను.

కద్రూ వినత లిద్దరికీ ఒకరిమీద ఒక రికి సహజ మత్సరభావం ఉండనే ఉంది. ఏలాఅయినా కద్రువ (కాస్త గడుసుది కాబట్టి) వినతమీద కక్ష సాధించుకోవా లనే చూస్తోంది. అయితే తగిన అవకాశం లభించలేదు. ఈ అనూరుజననం – శాపం మొదలైనవి బహుశః ఆమెకు పరోక్షంగా తెలిసిఉండవచ్చు. వినత తనంత తాను చెప్పదుకదా ! కద్రువకి పరోక్షంగా ఈ విషయం తెలిసిందని ముందుచెప్పే అవ సరం వస్తుంది. చెప్తాను. ఈ శాపం కద్రు వకి మరికాస్త అవకాశమైనది. ఆ కాలం లో వీరిద్దరూ వినోదార్థం సముద్రతీరానికి వెళ్ళారు. విహరిస్తున్నారు. (సశేషం)

# దిగంబర కవిత్వం ఒక సాహిత్య ఉద్యమం అనవచ్చా?

– శ్రీ డా. పి. ఎల్. నరసింహారావు

భారతదేశానికి ఇంగ్లీషు భాష చేసిన అనేక అపకారాలలో వాస్తవంగా విద్యావంతులైన మేధావి మైనారిటీ వర్గా నికి విశాలప్రపంచ దృక్పథం ఇవ్వటం ఒకటి. కేవలం తెలుగుభాషా సరిహద్దు లకు మాత్రమే పరిమితమైన దృక్పథం ఉన్నవాడు అదృష్టవంతుడు. ఆ సరి హద్దులుదాటి ఆంగ్లభాష కిటికీ ద్వారా ఇతరదేశాల సాహిత్యపరంగా దుర్భరవేద నకు గురిఅవక తప్పదు. వర్తమాన తెలుగు సాహిత్యరంగంలో వ్యాపిస్తున్న సృజనా త్మక రచనల మాట అటుంచి సాహిత్య విమర్శను మాస్తే కనీసం ఆంగ్ల సాహి త్యంతో పరిచయం ఉన్న అభాగ్యుడు కూడా అసంతృప్తి బాధితుడు కాక తప్పదు. సచేతనమైన వర్తమానత్వ స్పృహాప్లావితమైన సహేతుకమైన సాహిత్య శాస్త్రవిజ్ఞాన – ఆధారితమైన విమర్శ సృజనాత్మక సాహిత్య ప్రగతికి ఎంత దోహదకారి కాగలదో వివేక వంతులు ఎరిగిన విషయమే.

ఏ సాహిత్యంలో సచేతన, సశాస్త్రీయ విమర్శ లేదో ఆ సాహిత్యంలో సృజనా త్మక రచనా వ్యాపారం కుంఠితం కాక తప్పదు. ఈ దృశ్యాన్ని మన ప్రియమైన వర్తమాన – తెలుగుభాషలో ఈనాడు మనం చూస్తున్నాము.

ప్రస్తుత పరిశీలనాంశం అసలు దిగం బర కవిత్వ నామధారి రచనలు ఒక సాహిత్య ఉద్యమం అనవచ్చా? సాహిత్య విమర్శన దృష్ట్యాదేన్ని ఒక సాహిత్య ఉద్యమం అంటారు ? ఇలాంటి మౌల భూతమైన సాహిత్య విమర్శనా చైతన్యం విమర్శకుడిలో ఉండాలి.

ప్రాచీన సాహిత్యంలో ఆధునిక కాలంలో మాదిరి సాహిత్యోద్యమాలు పుట్టినజాడ లేదు. తెలుగులో వచ్చిన వీర శైవ వాఙ్మయం, భారతదేశంలో ఇతర ప్రాంతాల్లో వచ్చిన మధురభక్తి వాఙ్మయం ఇవన్నీ సాహిత్యోద్యమా లుగా ఆధునిక–అర్థంలో భావించవచ్చో లేదో చింతనీయం. ఎందుకంటే ఆనాడు సాహిత్యం ప్రజాజీవితం కంటే కేవలం మతవాదిత్వానికే ఎక్కువ సన్నిహితంగా ఉండేది. కనుక మతంలో వచ్చిన ఉద్య మాలు సాహిత్య రచనల్లోకి ప్రవేశించేవి. వాటి నన్నింటినీ ఈనాటి రోమాంటిక్, సర్రియలిస్టిక్, సింబలిస్టిక్, మార్క్సిస్టిక్ సాహిత్య ఉద్యమాల్లా భావించటం అంత యుక్తంగా కనిపించదు.

కానీ దింగబర కవిత్వాన్ని ఉద్య మంగా చూచేటప్పుడు ఆధునిక ప్రపం చంలో వచ్చిన ఉద్యమాల్ని దృష్టిలో పెట్టుకొనే విమర్శనాత్మక పరిశీలన చేయాలి. ఉదా:– జర్మన్ దేశంలో 19॥

(శ)తాబ్దంలో ప్రారంభించిన Romantic ఉద్యమం జర్మన్ దేశంలో మన దిగంబర కవులలాంటి నలుగు రైదుగురు అర్భకులు ఒక Limited కంపెనీగా ఏర్పడి ప్రారంభించింది కాదు. Romantic ఉద్యమం జర్మనీలో బిందు మాత్రంగా ప్రారంభించినా అది ఇంగ్లాండు, ఫ్రాన్సు; అమెరికా ఇత్యాది దేశాలకు వెల్లువలా ప్రవహించింది. చివరకు ఆనాటి బ్రిటిష్ కాలనీగా ఉన్న మన దేశపు ప్రాంతీయ భాషల్లోకి కూడా అడుగు పెట్టింది. తెలుగులో దాన్ని భావకవిత్వం అన్నారు. మరి ఈ సాహిత్య ఉద్యమాన్ని తీసికొని ఒక సాహిత్య ఉద్యమం లక్షణాలు పరిశీలిస్తే ప్రధానంగా కనిపించేవి :- (1) సాహిత్య ఉద్యమం ఒక లిమిటెడ్ కంపెనీ కాదు. (2) సాహిత్య ఉద్యమం తత్కాలీన, సాంఘిక, బౌద్ధిక వాతావరణ జన్యమైన ఒక మహత్తర జీవన దృక్పథం. (3) అంతటి శిఖరాయమాణజీవన దృక్పథ సాక్షాత్కారం, ఉద్యమకర్తలైన ఏ ఒకరిద్దరు మహాపురుషులలోనో ఒక విశాల సామాజిక చైతన్య దోహద క్రియలాగా స్రవిస్తుంది. (4) ఆ ఉద్యమకర్తలు అశేష, విజ్ఞాన, సంపన్నులు, నిమ్నోన్నత జీవన యాత్రికులు, బాధితులు, దర్శనసిద్ధులు అయిఉంటారు. (5) సాహిత్య ఉద్యమం తత్ కర్తల జీవన పరిపక్వతా ఫలితం కూడా.

వీటిని సాహిత్య ఉద్యమాల యొక్క కొన్ని ముఖ్యమైన లక్షణాలుగా గ్రహించవచ్చు. ఆధునిక యుగంలో వచ్చిన సాహిత్య ఉద్యమాలే కాక వైజ్ఞానిక రాజకీయాది ఉద్యమాల్లో కూడా ఈ లక్షణాలే సాధారణంగా కనుపిస్తాయి. రొమాంటిసిజమ్ కానీ సింబలిజం కానీ సర్రియలిజం కానీ సాహిత్య మార్క్సిజంకానీ ఏదైనాసరే సాహిత్య ఉద్యమంగా తీసికొని పరిశీలిస్తే మనకు అనివార్యంగా కనిపించే లక్షణాలు ఇవే.

ఈ పృష్ఠభూమి ఆధారంగా తీసికొని దిగంబర కవిత్వంతో వచ్చిన రచనలని పరిశీలిస్తే చాలా సమంజసంగా శాస్త్ర సమ్మతంగా ఉంటుంది. ఈ మార్గానికి భిన్నంగా కొన్ని సమీక్షారేఖల్ని విసిరి చేసినపుడు అది కేవలం విమర్శనాజ్ఞాన శూన్యుడైన వ్యక్తి రాగద్వేషాల చేత ప్రేరితుడై దిగంబరకవు లనబడే యువకులు ఈనాడు అక్రమంగా అనుభవిస్తున్న అకారణ కీర్తిమీద అసూయచేత చేసిన రచనగానే ఆ వ్యాసం కనిపిస్తుంది. అట్లాకాక వెనక వివరించిన ప్రధాన సాహిత్య ఉద్యమ లక్షణాల్లో ఒకటొకటి తీసికొని చూస్తే అది న్యాయంగా ఉంటుంది.

సాహిత్య ఉద్యమం ఒక లిమిటెడ్ కంపెనీ కాదు. అది సామాజిక జీవన దృక్పథంలో వచ్చిన మలుపును కొందరు మహత్తర వ్యక్తిత్వమున్న సాహిత్య కర్తలు తమ సృజనాత్మక రచనల్లోకి తమ శ్వాసతో కలిపి ఊపిరిలా ఊదడం లాంటిది. సూక్ష్మాతిసూక్ష్మ ప్రభావశాలి అయిన సాహిత్యం ఎప్పుడైతే అలాంటి మలుపు తీసికొంటుందో అప్పుడు సామాజిక జీవనంలో వాతావరణం క్రమశః మారుతుంది. జీవన విధానంలోనే ఒక నూతనయుగం ఆవిష్కృతమౌతుంది. మనకు తెలుగులో 1920 ప్రాంతాల్లో వచ్చిన భావకవిత్వ యుగంలో ఈలాంటి నూతన వాయువులు నాలుగు మూలల నుంచి దేశంలోకి ప్రవేశించాయి. ఆ గాలుల అంత చైతన్యాన్ని మహాకవులు గానం చేయటం, దేశంలో జాతీయోద్యమ సుడిగాలులు, బ్రహ్మసమాజ ప్రభాతాలు, అమలినకోమల ప్రేమాంబరాలు, నూతన శైలీమార్గాలు, అకలుషిత ఆంధ్రీమయ కంఠమధురిత నాటకరంగాలు, కొవ్వలి నవలలు, రాయప్రోలు కవితలు నిండి నిబిడీకృతమైన యుగాన్ని సృష్టించింది భావకవితోద్యమం. దాని ప్రభావం ఎవరి గుత్త సొమ్ము కాదు. సమాజమంతటా పరచుకొంది. ఎందరో ఆనాటి ప్రభావానికి ఐచ్ఛికంగా లొంగి కవితలు వ్రాశారు, నవలలు వ్రాశారు, కథలు వ్రాశారు. వాటి మధురిమ స్వచ్ఛము, సహజము, సత్యము, కనుక శాశ్వతంగా సాహిత్యంలో నిల్చిపోయింది. అభ్యుదయ ఉద్యమంకానీ, రొమాంటిక్ ఉద్యమం కానీ, తెలుగు దేశంలో మనం కళ్ళారా చూచాము. అవి దిగంబర కవిత్వంలా లిమిటెడ్ కంపెనీలు కావు.

ఎందుకంటే ఏవుద్యమమూ లిమిటెడ్ కంపెనీ కాదు కనుక. దిగంబర కవుల పరిమిత సంఖ్యాకులు_అయిదుగురో ఆరుగురో; ఏడవవాడు ఎవడైనా మీలో చేర తాను అనివస్తే వాణ్ణిచూసి వాళ్ళు భయ పడతారు, వాడు మనల్ని ఎక్కడ మిం స్తాడో అని. మహాప్రవాహం మహాపర తాల్ని కూడా అతిక్రమించి పోతుం కానీ దిగంబర కవిత్వంలా ఇటుకరాళ్ళ చూచి భయపడదు. కనుక దిగంబ కవిత్వం ఇటీవల ఆంధ్రజ్యోతి ప్రకటి వ్యాసంలో శ్రీ రమణగా రన్నట్లు "ఇల కొందరు కవులు కలిసి గుంపు కట్టడ వెనుక కీర్తి కండూతి ఉన్నదనడం సత దూరం కాదు." "వ్యష్టి గాకంటే స ష్టిగా వుంటే తెలుగు సాహిత్యచరిత్రల ఒక పుట కేటాయింపు జరుగవచ్చు న వూహ చాలమందికి కలిగింది". అని రన్నమాట ఇంకా సత్యమైన సత్యమ కనక దిగంబర కవుల "గుంపు" ఒక లి మిటెడ్ కంపెనీయే కానీ సాహిత్యవుద్యమ కాదు.

(సశేష

# విశ్వనాథవారి సాహిత్య విమర్శ

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

నేటి సాహిత్య ప్రక్రియలలో విమర్శ కూడా ముఖ్యమయింది. సుమారొక శతాబ్దం క్రితం కందుకూరి వారితో ప్రారంభమయిన తెలుగు సాహిత్యవిమర్శ ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతాలకొక సమన్వయ రూపంగా దినదినాభివృద్ధి కాంచుతున్నది. సమాగ్రముఖాలతో సర్వవిషయాలను స్పృశిస్తున్నది. పాఠకులోకాని కది విషయగ్రహణ పారీణత్వం ప్రసాదిస్తున్నది.

## విమర్శ అంటే ?

'అనుభూతి విశేషాలను వివేచించి, నిర్ణయించడానికి చేసే ప్రయత్నమే విమర్శ' అని రిచర్డ్సు పండితుని అభిప్రాయం. (సాహిత్య దర్శనం-పే6) అంటె ఒక విషయంలోని గుణదోష విచారణచేసి దాని నిగ్గుదేల్చి, సమాజానికది ఎంతవరకూ సహాయపడుతుందో నిర్ణయించే ఒక ముఖ్యసాధనం విమర్శ. అందుకే అది ఒక శాస్త్రం, ఒక కళ. శాస్త్రంలాగా ఒక విషయాన్ని పరిశీలించి గుణదోషాలను మదింపువేసి కొన్ని సామాన్య సూత్రాలను నిర్మిస్తుంది. కళలాగా నూత్న విషయాలను సృజించే శక్తిని ప్రోత్సహిస్తుంది. కాబట్టి "విమర్శ రెండువేపులా పదునున్న ఒక శక్తిమంతమైన ఆయుధం. కళాస్రష్టయైన రచయిత హృదయాన్ని, కళాపిపాసియైన సామాజికుని అనుభవాన్ని విలువకట్టి సప్రమాణంగా వెలువరిస్తుంది." (రచన-పే138)

అందుకే విమర్శకుడొక విషయానికి విలువగట్టే షరాబు, న్యాయాన్యాయ నిర్ణేత. శాస్త్రవేత్త, కళాకారుడు, పరిశీలకుడు. పరిశోధకుడు, ప్రామాణికుడు.

'కవి సృష్టికి వ్యాఖ్యాత. విమర్శకుడు కవికావ్యమునకు వ్యాఖ్యాత. కావ్యవ్యాఖ్యానమైన విమర్శనము భావుకుడైన కవికి, సహృదయుడైన పాఠకునకు మధ్య వారధివంటిది ..కవి అర్థము నాశ్రయించి శబ్దమును గ్రహిగించును. అందుకే 'కవిత్వము హృదయసంబంధి, విమర్శనము మేధాసంబంధి.' (తెలుగులో సాహిత్య విమర్శ-పే 34) -డా. యం. వి. యన్. రామారావు )

'విమర్శరూపిణీవిద్యా' అని పరాశివిని విమర్శరూపిణిగా మన పూర్వులు వర్ణించారు. 'విమర్శ అంటే గ్రీకు భాషలో సదసద్వివేచనం; కాబట్టి సమదర్శనం, సత్యప్రకటనం విమర్శకునికి నయనయుగళం. ఈ రెంటిలో ఏది లోపించినా కొరత, కలత' అని సి. నా. రె. గారు అంటారు తెలుగులో సాహిత్య విమర్శకు వ్రాసిన ఆ ముఖంలో.

సాధారణంగా లోకంలో కవి అయినవాడు విమర్శకుడు కాడు. విమర్శకుడయిన వ్యక్తి కవి కాలేడు. ఇది పండితుడు, కవి అయిన వాడొకడే అనేటటువంటిది. ఎందుకంటే 'ప్రతిభ బుద్ధి వ్యాపార నియంత్రిత మయితే కవిత. బుద్ధీంద్రియ వ్యాపారానికి అత్యధిక ప్రాధాన్యంకల్గిన దశ విమర్శ' (సాహిత్య దర్శనం- పే31) కాని కవి అయినవాడు పండితుడయితే ఎంతగా రాణిస్తాడో, కవి అయినవాడు విమర్శకుడయితే అంతకీర్తి గాంచుతాడు. కవి, విమర్శకుడు అయినచో తన అనుభవాన్ని కూడా పొందుపరచి కావ్యాన్ని సానుభూతితో సమీక్షిస్తాడు ఏది ఉపాదేయమో, ఏది అనుపాదేయమో నిర్ణయిస్తాడు. కాబట్టి 'కావ్యజ్ఞుడైన విమర్శకుని విమర్శ బుద్ధివర్ధకం కాగా; కావ్యవేత్త విమర్శ ఆనందవర్ధకం అవుతుంది. కావ్యజ్ఞుని విమర్శ శాస్త్రసమ్మతం కాగా కావ్యవేత్త విమర్శ కళాసమ్మతం, కాంతాసమ్మితం' గా ఉంటుంది. (తెలుగులో సాహిత్య విమర్శ-డా. పాటిబండ-పే 3) అటువంటి కావ్యనిర్మాణ మర్మద్రష్టలలో కళాప్రపూర్ణులు విశ్వనాథ వారు ప్రముఖులు.

మహాకవిగా, నాటకకర్తగా, నవలాకారుడుగా, కథా రచయితగా ప్రఖ్యాతిగన్న విశ్వనాథవారు సాహితీ విమర్శకులలో కూడా ఒక విశిష్టస్థానం ఆక్రమించారు. విశ్వనాథ విమర్శ ముఖ్యంగా ధ్వనిమార్గాన్ని అనుసరించే శిల్పదృష్టితో కూడి ఉంటుంది. ఆయన సంప్రదాయబద్ధుడైనప్పటికీ తన విమర్శనలో నూత్న పద్ధతుల్ని అనుసరించి "తనది"అని చెప్పదగిన ఒక విలక్షణమైన శైలిని సంతరించుకున్నాడు. కట్టమంచితో నూతన మార్గాన్ని త్రొక్కిన తెలుగు సాహిత్య విమర్శ విశ్వనాథ వారితో సంపూర్ణత్వం పొందింది అని చెప్పవచ్చు.

'కావ్యానికి రసమేకాక రసేతరమైన పరమార్థం కూడా ఉన్నదనీ, మహాకవి రసానికీ ఆ పరమార్థానికీ అభిముఖంగా కావ్యాంగాలను సంధిస్తూ ఉంటాడనీ, ఈ దృశ్యమైన శిల్పాన్ని దర్శించటమే ఉత్తమవిమర్శ అనీ విశ్వనాథవారి అభిప్రాయం (తె.సా వి- డా. పాటిబండ- పే 20)

విశ్వనాథవారి విమర్శను స్థూలంగా (1) సాహిత్యలక్షణ గ్రంథాలు (2) విమర్శగ్రంథాలు. (3) పీఠికలు (4) సమీక్షలు (5) వ్యాసములు. (6) ఉపన్యాసములు అని ఆరు భాగాలుగా విభజించవచ్చు.

(తరువాయి 18 వ పేజీలో)

# ప్రసిద్ధ హిందీకావ్యం "కామాయని" విశిష్టత

— శ్రీ బి. వి. రమణ, ఎం. ఏ.



ఆధునిక హిందీ సాహిత్యంలో శ్రీ జయశంకర ప్రసాద్‌కు గల స్థానం అద్వితీయం. ప్రసాద్ బహుముఖ ప్రజ్ఞాశాలి. కవిగా, నాటకకర్తగా, కథారచయితగా, నవలాకారుడుగా, విమర్శకుడుగా వివిధ సాహిత్య ప్రక్రియలలో అసమాన ప్రతిభను చూపిన స్రష్ట.

జాన్‌సన్ మహాశయుడు గోల్డ్‌స్మిత్‌ను గూర్చి చెప్పిన, "He left scarcely any thing untouched and touched nothing which he did not adorn" అనే మాటలు హిందీసాహిత్యంలో జయశంకర ప్రసాద్ వ్యక్తిత్వానికి సరిపడతాయని చెప్పవచ్చును.

ప్రసాద్ రచనలన్నిటిలో "కామాయని" శ్రేష్ఠమైనది. ఈ కావ్యంమీద విశ్వవిద్యాలయ ప్రాంగణాలలో అనేక పరిశోధనలు జరిగాయి. సమకాలీన సాహిత్యవేత్తలు, విమర్శకులు ఈ కావ్యాన్ని ముక్తకంఠంతో ప్రశంసించారు.

పండిత వినోద శంకరవ్యాస్ 'కామాయని' ప్రాశస్త్యాన్ని ఇలా వివరించారు "కామాయని, రామచరిత-మానస తరువాత హిందీ సాహిత్యానికి విశ్వసాహిత్యంలో స్థానం చేకూర్చే కావ్యం. హోమర్, మిల్టన్, వాల్మీకి, కాళిదాసుల కావ్యాలతో సరితూగే కళాఖండమిది."

ప్రసిద్ధ హిందీ కవయిత్రి మహాదేవి వర్మగారి అభిప్రాయ మిది, 'కామాయని మహాకావ్యాల చరిత్రలో నూతనాధ్యాయం సృష్టించింది. ఎందుచేతనంటే కామాయని ఒక వైపు చారిత్రాత్మక ధరాతలం మీద నిలచి, మరోవైపు సాంకేతిక అర్థంలో మానవ వికాసాన్ని గూర్చి తెలిపే కావ్యం గనుక.'

మానవజాతికి మూలపురుషుడైన మనువుకథ ఈ కావ్యానికి ఇతివృత్తం. కవి, ఋగ్వేదం, వైవస్వత మనుచరిత్ర, శతపథ బ్రాహ్మణం, పురాణాలలో చెప్పబడిన మనువుచరిత్రను ఆధారంగా చేసికొని ఈ కావ్యాన్ని రచించారు. "కామగోత్రజా శ్రద్ధానామర్షికా" అన్న శ్రద్ధా సూక్తాన్ని అనుసరించి కామగోత్రజ అయిన శ్రద్ధాదేవిని కావ్యనాయికను చేసి, కావ్యానికి "కామాయని" అని నామకరణం చేసారు.

కావ్యంయొక్క ప్రథమభాగంలో కనిపించే జలప్రళయం మొదలైన సంఘటనలు ఇస్లాం, క్రైస్తవ మతగ్రంథాల లోను, యూదుల యవనుల పురాణాల లోను కూడ చెప్పబడినవే. కల్పన, చారిత్రక సత్యాలకలయికతోపాటు, మానసిక విశ్లేషణ ఈ కావ్యానికి పుష్టిని చేకూర్చింది.

సంక్షిప్తంగా చెప్పాలంటే 'కామాయని' లోని కథాగమనం ఇలా సాగుతుంది.

జలప్రళయం నుండి బ్రతికి బయటపడ్డ మనువు హిమాలయ పర్వతప్రాంతం చేరుకొంటాడు. తన గత వైభవాన్ని తలచుకొని, వర్తమాన దీనావస్థను గూర్చి విలపిస్తాడు. అలాంటి పరిస్థితిలో అతనికి శ్రద్ధ అనే స్త్రీతో పరిచయం కలుగుతుంది. శ్రద్ధ ఆగమనంతో చింతాక్రాంతుడైన మనువుకు తిరిగి జీవితంమీద ఆసక్తి కలుగుతుంది. అసుర పురోహితులు, ఆకులి, కిలాత్‌ల సహాయంతో పశువును బలియిచ్చి యజ్ఞం చేస్తాడు. శ్రద్ధామనువుల దాంపత్య ఫలితంగా శ్రద్ధ గర్భవతి అవుతుంది. శ్రద్ధయొక్క అనురాగం భావి సంతానం వైపు మరలడం సహించలేక, స్వార్థపరుడైన మనువు ఆమెను విడిచి వెళ్ళిపోతాడు. సారస్వత నగరానికి రాణి అయిన ఇడను కలుసుకొంటాడు. ఇడకోరిక ప్రకారం అస్తవ్యస్తమైన సారస్వత నగర శాసనాన్ని సరిచేసి పరిపాలన కొనసాగిస్తాడు. విషయలోలుడైన మనువు ఇడపై కూడ తన అధికారాన్ని ప్రదర్శింపచూస్తాడు. ఆమెను బలాత్కరించి అనుభవించడానికి ప్రయత్నిస్తాడు. అంతటితో ఇడకు మనువుపై విముఖత ఏర్పడుతుంది. ప్రజలలో కల్లోలం చెలరేగుతుంది.

అక్కడ కలలో గాయపడిన మనువును చూసిన శ్రద్ధ ఆందోళన చెంది, తన కుమారుని వెంటబెట్టుకొని మనువుకోసం

---

( 12వ పేజీ తరువాయి )

## సాహిత్యలక్షణ గ్రంథాలు

విశ్వనాథవారు సంస్కృతంలోని సాహిత్యశాస్త్ర గ్రంథాల నన్నింటినీ వంటపట్టించుకున్న వారు. పాశ్చాత్య సాహిత్య శిల్పదృష్టితో మన భారతీయ శాస్త్ర సంప్రదాయాలను సమన్వయం చేసుకున్నారు. కవిత్వతత్త్వం సమగ్రంగా తెలుసుకోవడమేకాక సంగీతాది ఇతర కళారహస్యాలను పరిపూర్ణంగా పరిశీలించారు విశ్వనాథ. అధ్యయనం ద్వారా, అనుభవంద్వారా గడించిన ప్రతిభావిశేషములకు ప్రతిబింబాలే విశ్వనాథవారి సాహిత్యలక్షణ గ్రంథాలు.

ఈ కోవకు చెందిన వాటిలో ముఖ్యమయింది ప్రప్రథమంగా పేర్కొదగింది 'సాహిత్య మీమాంస'. ఇది నాలుగు చిన్న గ్రంథాలుగా వ్రాయాలని సంకల్పించి విధి వశాత్తు 'కావ్యానందము' అనే మొదటి భాగాన్ని మాత్రమే ప్రకటించారు. (అరవింద ప్రచురణలు-గవర్నరు పేట-విజయవాడ,) (సశేషము)

గాలిస్తుంది. చివరకు ప్రజల తిరుగుబాటు ఫలితంగా గాయపడిన మనువును కలుసుకొని, తన కుమారుని ఇడ దగ్గర విడచి, మనువును మానససరోవరానికి తీసుకొనిపోతుంది. అక్కడ శ్రద్ధ సహాయంతో మనువు త్రిపుర సౌందర్యాన్ని దర్శించి అలౌకిక ఆనందాన్ని అనుభవిస్తాడు. ఆ తరువాత ఇడ, మనుపుత్రుడు, సారస్వత నగరవాసులుకూడ మానససరోవరం చేరుకొంటారు. మనువుతోపాటు అందరూ ఆనందంలో లీనమౌతారు.

'కామాయని' లో పదిహేను సర్గలున్నాయి. ఈసర్గల నామకరణం పాత్రలను అనుసరించికాని, కథా వస్తువులోని సంఘటనల బట్టిగాని కాకుండ, మానవునిలో నిరంతరం వికసించే మానసిక ప్రవృత్తులనిబట్టి చేయబడింది. క్రమంగా, చింత, ఆశ, శ్రద్ధ, కామం, వాసన, లజ్జ, కర్మ, ఈర్ష్య; ఇడ, స్వప్నం, సంఘర్షణ, నిర్వేదం, దర్శనం, రహస్యం, ఆనందం అనేవి సర్గల పేర్లు.

'చింత' మానవునిలోని చైతన్యాన్ని సూచించే మూలప్రవృత్తి. జీవితంలోని అభావం కారణంగా, చింత ఉత్పన్నమౌతుంది. దీని వల్ల మనస్సుకు అశాంతి కలుగుతుంది. ఈవిధమైన అశాంతిని దూరం చెయ్యడానికి 'ఆశ' ఉద్భవిస్తుంది. ఆశమానవుని జీవితం మీద ఆసక్తిని పెంచుతుంది. ఆశ తరువాత శ్రద్ధ జనిస్తుంది. మానవుని ప్రగతి, వికాసం శ్రద్ధద్వారానే సంభవం. శ్రద్ధ తరువాత 'కామం','వాసన' అనేభావాలు ఉదయిస్తాయి. కోరికజనించడం కామం అయితే కామంయొక్క తీవ్రరూపం'వాసన'. వాంఛ తరువాత, 'లజ్జ' జనిస్తుంది. లజ్జ నారీ జీవితంలోని అత్యంత స్వాభావిక ప్రవృత్తి. స్త్రీకి భూషణం వంటిది. లజ్జవలన స్త్రీలో ఆకర్షణ పెరుగుతుంది.

కామం తీవ్రరూపం చెదినప్పుడు తృష్ణ పెరుగుతుంది. తత్ఫలితంగా, మానవుని మనస్సు "కర్మ" వైపు మరలుతుంది. కర్మయొక్క తీవ్రరూపం హింసాత్మక ప్రవృత్తి వైపు దారితీస్తుంది. దీనివలన మానవునిలో సహనశీలత నశించి స్వార్థం వృద్ధిచెందుతుంది. తత్ఫలితంగా "ఈర్ష్య" జనిస్తుంది. ఈర్ష్యవలన ఇతరుల సుఖదుఃఖాలయెడల సానుభూతిపోయి, విరోధభావం పెరుగుతుంది. ఇది కర్మయొక్క సంకీర్ణరూపం. దీనివలన మనిషిలో అహంభావం పెరుగుతుంది. అహంభావియైన మానవుడు 'ఇడ' ను ఆశ్రయిస్తాడు. ఇడ బుద్ధికి చిహ్నం. బుద్ధియొక్క తీవ్రరూపం 'సంఘర్షణ' కు దారితీస్తుంది. మానవునిలోని చైతన్యానికి సంబంధించిన వ్యక్తావ్యక్త రూపాలు రెండింటికీ జరిగే సంఘర్షణ ఫలితమే 'స్వప్నం' ఈవిధంగా బుద్ధిచేత ప్రభావితమైన మనస్సు వికలమౌతుంది. మనస్సులో 'నిర్వేద' భావం కలుగుతుంది. తిరిగి మానవుడు శ్రద్ధను ఆశ్రయించి ఆత్మతత్త్వాన్ని 'దర్శించి' తన పరాజయానికి కారణభూతమైన 'రహస్యం' తెలుసుకొంటాడు. చివరకు శ్రద్ధసహాయంతో శాశ్వత 'ఆనందం' అనుభవిస్తాడు.

కవి పాశ్చాత్యరూపక విధానాన్ని (Allegory) అనుసరించి కావ్యంలో మూలకథకుతోడు, సాంకేతిక రూపంలో మరొకథను జోడించాడు. శ్రద్ధామనువులద్వారా సంభవించిన మానవ సృష్టిని గూర్చి తెలియజెయ్యడం మూలకథలక్ష్యం అయితే, ఆనందమయజీవితం ఎలా సాధ్యమో సాంకేతికకథ వివరిస్తుంది.

కథయొక్క సాంకేతిక రూపాన్ని అనుసరించి మనువు మనస్సునకు,శ్రద్ధ హృదయానికి;ఇడ బుద్ధికి, అసుర పురోహితులు అకులి, కిలాత్, ఆసుర మనఃప్రవృత్తులకు సోమలతావృత్తమైన వృషభం, భోగయుక్తమైనధర్మానికీ; జలప్లావనం ఇంద్రియ భోగలాలసతకు;త్రిపురములు ఇచ్ఛ, కర్మ, జ్ఞానములకు, మానససరోవరం మనస్సుయొక్క సమరసభావానికి; సారస్వతదేశం భౌతిక తత్త్వానికీ, ప్రజావిప్లవం బుద్ధివాదానికీ ప్రతీకలు.

సుప్రసిద్ధ విమర్శకులు డా॥ నగేంద్ర కామాయనిలోని రూపకతత్త్వాన్ని ఇలా వివరించారు.

"సుఖవాద బుద్ధివాదాల తీవ్రతవల్ల మనస్సు వికలంకావడం స్వాభావికమే. దీనివల్ల మనస్సు భయంకరమైన గ్లాని, నిర్వేదభావాలకు లోనై పలాయనం చిత్తగిస్తుంది. శ్రద్ధ ఈభావాలను తొలగిస్తుంది. శ్రద్ధ కలయికతో మనస్సు ఉచిత మార్గాన్ని అవలంబించి వికసించి; ఆత్మసాక్షాత్కారాన్ని పొందుతుంది. శ్రద్ధద్వారా తన పరాభవానికి సంబంధించిన రహస్యం స్పష్టమౌతుంది.

ఈ వైరుధ్యానికి కారణం మూడు మూల ప్రవృత్తుల మధ్య సామరస్యం కుదరకపోవడమే. భావప్రవృత్తి, జ్ఞానప్రవృత్తి; (To feel; To know, To will) వేరువేరుగ కనిపించడమే. శ్రద్ధద్వారా వాటి మధ్య సామరస్యం కుదిరిననాడు మనస్సు సమరసభావముతో పూర్ణానందంలో లీనమౌతుంది. శ్రద్ధతన కుమారుని ఇడకు అప్పగించడంలోకూడ సామరస్యం ఉన్నది. శ్రద్ధామనువుల కుమారుడు కావడంవల్ల మానవుడు జన్మతః మననశీలము, శ్రద్ధ కలిగినవాడే. ఇడప్రాపకంవల్ల వీటికి తోడు అతనిలో బుద్ధి పరిపక్వత చెంది పరిపూర్ణ మానవత్వం సిద్ధిస్తుంది.

ఈ విధమైన వైరుధ్యం ఆధునిక మానవజీవితానికి అంతటికి సంబంధించి

నది. దీనికి కారణం నేటిమన భావ ప్రవృత్తి; అనగా, మతం, నైతికత, కళ, సాహిత్యం మొదలైనవి; జ్ఞానప్రవృత్తి; అనగా, రాజనీతి, అర్థికవ్యవస్థ వేరు వేరుగా ఉండడమే. వీటి మధ్యసామరస్యం లేకపోవడం వల్ల మానవజీవితం బాహ్యంగానూ, అంతరంగికంగానూ, సంఘర్షణకు లోనౌతుంది. వ్యక్తివాది అయిన మనువు భౌతిక సుఖవాదానికి ప్రతీక. దీనికి మూలం పెట్టుబడిదారీ విధానం. అతడు ఇడ అనగా విజ్ఞానశాస్త్రం సహాయంతో జీవితంలోని సర్వసుఖాలనూ తానే అనుభవించాలని ప్రయత్నిస్తాడు. చివరకు శ్రద్ధలేనిదే ఈ వైరుధ్యం తొలగదని తెలుసుకొంటాడు. ఈశ్రద్ధ అనగా రాగాత్మక ప్రవృత్తి గాంధీజీ చెప్పిన అహింస, పాశ్చాత్య తత్త్వవేత్తలు చెప్పిన మానవతావాదాలకు పర్యాయపదం_నేడు మానవతావాదదృక్పథం ద్వారానే ఇచ్ఛ, జ్ఞానం, క్రియఅనగా సంస్కృతి, విజ్ఞానం, రాజనీతి, వీటిమధ్య సామరస్యం సాధ్యమౌతుంది. నేటి పెట్టుబడిదారీ విధానం వల్ల పీడింపబడుతున్న సమాజానికి సంబంధించిన వైరుధ్యం మానవతావాదంవల్లనే సరికాగలదు. ఈ మానవతా వాదం యొక్క భౌతిక రూపం సమాజవాదం అయితే ఆధ్యాత్మిక రూపం గాంధీ వాదం.

(డా. నరేంద్ర గారి రామాయణములో రూపతత్త్వం అనే వ్యాసం నుండి)

(సశేషం)




## ఋతు సూక్తము

(రచయిత : శ్రీనందుల గోపాలకృష్ణ మూర్తి, పుటలు. 156, మూల్యము రు. 5_00. ప్రాప్తిస్థానము : శ్రీమతి నందుల రామలక్ష్మి, 7_9_13, సాంబమూర్తివీథి, రామారావుపేట, కాకినాడ.)

ఋతుసూక్తము ఒక విమర్శగ్రంథం. ఆంధ్రవాఙ్మయంలోని అనేక ప్రాచీన నవీన కావ్యాలలో ఏ కవి ఏ విధంగా ఋతువులను వర్ణించాడో ఈగ్రంథంలో రచయిత తెలిపారు. కాలప్రకృతి ఋతుచక్రభ్రమణం మీద ఆధారపడ్డది. నిత్య చైతన్యవంతమైన కాలపురుషుని హేలకు ఈ ఋతువులు ప్రత్యక్ష ప్రమాణాలు. అంగుకనే దాదాపు కవిత నేర్చిన ప్రతి కవీ ఋతువర్ణన నెపంతో కాలపురుషుని స్తోత్రం చేసి ధన్యుడైనాడు.

శ్రీగోపాలకృష్ణమూర్తి గారు ప్రాచీన కవులలో నన్నయ, నన్నెచోడుడు, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన్న, భాస్కరుడు, బుద్ధారెడ్డి, మొదలైన వారి కావ్యాలనుండీ, నవీన కవుల్లో తిరుపతి వేంకట కవులు, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి, శ్రీశ్రీ, సి. నారాయణ రెడ్డి, దిగుమర్తి సీతారామస్వామి, శనగన నరసింహస్వామి, జ్ఞానానందకవి, పైడిపాటి సుబ్బరామకవి మొదలైనవారి రచనల నుండీ అనేకలక్ష్యాలను ఉదాహరించి చూపారు.

మధుమాస మాధుర్యము, గ్రీష్మాటోపము, వర్షాభ్యుదయము, శరన్నీరాజనము, హేమంత సౌభాగ్యము, శిశిరవిలాసము_ అనే ఆరుశీర్షికలక్రింద ఆరుఋతువులు వ్యాఖ్యానింపబడ్డాయి.

ఋతుసంఖ్యను గూర్చి వీరు వివరిస్తూ 'యః త్రాతురీ య మృతుభిః' అన్న వాక్యానుసారం గ్రీష్మవర్ష హేమంతాలు అనే మూడు ఋతువులే చెప్పబడ్డవనీ, అల్లాగే "పంచారే చక్రే పరివర్తమానే' అన్న వాక్యానుసారం ఆ సంఖ్య అయిదుగా కానవస్తున్నదనీ వ్యాఖ్యానించారు. ఋతుసంఖ్య విషయవివక్షలో వీరు ప్రత్యేకకృషి చేశారు.

గ్రీష్మ ఋతువును వర్ణిస్తూ కనవర్తి అబ్బయామాత్యుడు చెప్పిన

'సన్నములయ్యె రాత్రులు, ప్ర
సన్నములయ్యెను మల్లెగుంపులా
సన్నములయ్యెజాజులు, వి
షణ్ణములయ్యెను బొందువేళ, లు
త్పన్నములయ్యెగాడ్పులు, వి
పన్నములయ్యెను జంతువుల్ సుసం
పన్నములయ్యె నెండ లతి
పన్నవసంత దినాంతరంబులన్.'

అన్నపద్యం శబ్దవైచిత్రి ప్రసన్నమైన ఉదాహరణం అయితే, తిరుపతి వెంకట కవులు వ్రాసిన

'ఇతరుల దాహపుం గతుల
నెన్నఁగనేల ? దినేశునంత వాఁ
డతితర తృష్ణచేఁ దనస
హస్రకరమ్ములు సాచి, నేమపుం
గలివిడనాడి గుంటలనె
కాదు, నదమ్ములఁగాదు, కూపసం
తతులనెగాదు కంటికిఁ గ
నంబడినంతయుఁ ద్రావెనీరమున్.'

అనే పద్యం అర్థగంభీరతకు నిండైన లక్ష్యం.

శ్రీనాథకృతమైన

'హేమంతావధి సంప్రబోధ గురువుల్
హృజ్జాత తేజోఽగ్నిధా
య్యామంత్రాక్షరముల్ పటీరగిరి వ
న్యా మందవాతూలముల్

వేమాఱుంగల శీతసూభవ వధూ
వేణీభరాంతః ప్రసూ
నామోదగ్రహయాళువుల్ పొలసెద
న్నారామ మధ్యంబునన్.'

వంటి కొన్ని పద్యాలను శ్రీ గోపాల కృష్ణమూర్తిగారు కొంత లఘువ్యాఖ్యాన రూపంలో తాత్పర్యం అయినా చెప్పి ఉంటే సామాన్య పఠితకు కూడా అర్థ గ్రహణ విషయంలో మరికొంత సాయ పడినట్లయేదేమో అనిపిస్తున్నది.

అల్లాగే-శ్లేషప్రాణిత మైన
'ఇచ్చు ఘనులుండిరనియప్పు లిచ్చుబడసి
పొంగిపొరలిన సరసుల పొలుపు దతిగ.'

అన్న పద్యంకూడా కించిత్ వ్యాఖ్యాన సాపేక్షమే. ప్రత్యేకించి ఈ పద్యం వసుచరిత్ర పోకడలు అవగాహన చేసు కొన్న సహృదయునికి గాని, అంత ఆనంద దాయకం కాకపోవచ్చు.

డా॥ అంతటి నరసింహం గారు ఋతు వర్ణనల మీదనే ప్రత్యేకకృషి చేసి డాక్టరేట్ పొంది ఉన్నారు. శ్రీ మేడ వరం వెంకట నారాయణ శర్మగారి 'ఋతుసంహిత' అన్న గ్రంథం 1966-67 లలో ఆం.సా. ఎకాడమీవారి బహుమతి నందినది. ఈ మూడు గ్రంథాలూ ఒక కోవకు చెందినవి.

శ్రీ నందుల గోపాలకృష్ణమూర్తి గారి రచన, స్పష్టమై, సలక్షణమై, నిర్దుష్టమై యుండి, సుగృహీత నామధేయులైన ఆచార్య, శ్రీ దివాకర్ల వేంకటావధాని గారి రచనా శయ్యకు దగ్గరగా నిల్చి చక్కగా ఉంటుంది.

ఎంతో పరిశీలించి శ్రీనందుల వారు కూర్చిన ఈ ఋతుసూక్తము 'భాషాప్ర వీణ' విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా నిర్ణ యింపబడడం చాల సముచితమైన విష యం. రచయిత ఈ మార్గంలో ఇతోధిక కృషి చేసి 'సాహితీసరస్వతిని ఆరాధింతురు గాక!'

— సుగుణారాధక.

## జ్యోతిర్మయి

(శాంతిశ్రీ - జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారు. వెల 3 రూ. ప్రతులకు : జంధ్యాల నాగేశ్వరరావు, శాంతిసదన్, సుబ్బారావుపేట, తాడేపల్లిగూడెం)

వాగ్దేవిని బహువిధములుగా భావిం చిన కృతకృత్యులు పలువు రాంధ్రమున గలరు. పరుల వాక్కుల నారాధించియూ జ్యోతిస్సునుండి స్ఫూర్తి నందినవారు కొం దరు మరికొందరు స్ఫూర్తిని తమకవిత్వ మున గాంచినవారు. అట్లు వచ్చిన రచన లలో జ్యోతిర్మయి యొకటి. ఇది సుమారు నూరు పద్యముల గ్రంథము. దీనిని రచిం చినవారు శ్రీ జంధ్యాల వేంకటేశ్వర శాస్త్రిగారు. వీరి ఉపనామము శాంతిశ్రీ.

ఈకావ్యమున కల్యాణమూర్తి మున్న గు ఖండిక లెనిమిది కలవు. వీరి పద్య రచన వీరికిగల బహుగ్రంథ పరిచయ మును సూచించును. ధారాశుద్ధి, శయ్య, పద్యనిర్వహణ మున్నగునవి చెప్పదగినవి. కళ్యాణమూర్తి శ్రీనివాసునిస్తుతి ప్రధా నము. ఇందు కవికి గల భక్తిభావన వ్యక్త మగుచు లోకజ్ఞతను సూచించును. 'వికృ తియేగాని అసలైన ప్రకృతి యెరుగ, ఇట్లు జగదీశ నన్నుసృష్టించితేల' వంటివి ఉదా హరణలు. దినేశ రజనీశ శారదేశ పార్వ తీశాది దేవతాపటలి నిటలమణి కిరీట ప్రభా భాసమాన మహిత సుందరారుణ చరణారవిందయుగళ' దీని భావము దుర వగాహము. నిటలమందు మణికోటి ప్రభ లేమిటి? 'జ్యోతిర్మయి' లో రెండవ పద్యంలో సంక్రాంత మొనర్పవే (దే నిని) అందులోనే, విరోధభావనాశాంతి యదేల? (అకారప్రశ్లేష వుండాలి) లక్ష్మీ సరస్వతీసంభాషణ సంసారసాగరంలోని అలల్ని కాక తిమింగిలాల్ని మొసళ్ళని స్మృతికి తెస్తుంది. అట్టి దేవతల సంసార పరాధీనత - అత్త - కోడలు తగువులో వ్యంగ్యం వాచ్యాన్ని మించలేకపోయిం దనిపిస్తుంది. లోకసహజముగా నున్నది. 'సభికులు, సుస్వాగతమే, విచారణీయ ములు. 'విశ్వనాథ' లో (ఇది శ్రీ విశ్వ నాథవారి నిర్యాణంలో వ్రాయబడినది) 'నూత్నకిన్నెరలు,' చివరి పద్యంలోని మొ దటి దీర్ఘసమాసము(కలశాంభోధిశశాంక శంకర సుధాకైలాసమందాకినీ జలజాతా భ్రమరాళి కీర్తివిభవా?) దీనిఅర్థం విచార ణీయం. ఉత్తరార్ధంలోని విశ్వనాథవారి సమాసం 'అలఘుస్వాదు రసావతార' యిత్యాదికంతో పొంతనలేనిదిగా వుంది. సుందరాంగి బృందము, పుష్పవాయనము, మున్నగునవి విచారణీయములు. మధుబాల గాయకబ్రహ్మ,మంగళగౌరి,రామమహిమ బాగానే నడిచినవి.

వైభోగము, దండకాకుంభిని వంటి పదాలు విచిత్రంగా వున్నాయి. రామ మహిమ, రామచరిత మానసంలో ఒక భాగమున కనువాదం అయినా స్వతం త్రంగా వుంది. కాని శివపార్వతులు రామ భక్తులు కావడం, పార్వతి రాముని పరీ క్షించడానికి సీతారూపంలో భంగపడ డం కొంత విచిత్రముగా నుండును.

మొత్తముమీద పద్యాలసంఖ్య నూరైనా రచన బాగుగా నున్నది. పాఠకుడు కొద్దిపాటి శ్రమతో పుస్తకం పూర్తి చే స్తాడు. శ్రీ కవిగారు మరింతకృషితో మరింత మనోహరంగా మరిన్ని మనోహర కృతుల్ని రచిస్తారని పాఠకు లాశింప వచ్చును. అట్టి ఆశకు తగిన సామగ్రి వీరి వద్ద బాగానే వున్నది.

— శ్రీ సుప్రసన్న

# సన్నయ జయంతి ప్రసంగం - లేఖ

శ్రీయుతులు

'సమాలోచన' సంపాదకులకు,

ఆర్యా,

నవంబరు నెలలో రాజమహేంద్రవరములో జరిగిన 'నన్నయ జయంతి' సందర్భమున, చేసిన ప్రసంగమును గూర్చి మీ పత్రికావిలేఖకుడు చేసిన వ్యాఖ్యానము చూచుట తటస్థించినది.

సాహిత్య విమర్శకుడుగా విమర్శను ఆహ్వానిస్తాను. విమర్శకు వెరగు పడడం గాని, వెగటుపడడంగాని, సాహిత్యానికి మేలు కూర్చదు. ఒక సాహిత్యప్రక్రియనుగూర్చి చర్చించి నిగ్గుతేల్చడం ఉత్తమం. అయితే_మీ పత్రికావిలేఖకుడు, అనవధానత వల్ల సమాలోచన పాఠకులకు ఆ ప్రసంగమును గూర్చి సరియైన అవగాహన ఇవ్వలేక పోయినందుకు విచారిస్తున్నాను.

తన పాఠకులకు సరియైన అవబోధ కలిగించలేని లేఖకుడు, పాఠకుల యెడల అపచారం చెయ్యడమే కాక_ తెలియకుండా తనకు తానే అపకారం చేసుకున్న వాడవుతాడు.

అతడు కొన్ని ప్రశ్నల రూపంలో, తన అభిప్రాయ భేదాలను సున్నితంగా వ్యక్తం చేశాడు. బాగుంది. వాటివిషయంలో ప్రసంగకర్త హృదయం మిదీ_ అని మీపాఠకులకు కొన్ని వివరణ లివ్వడం ఉచిత మని తోచి ఈ మాటలు వ్రాస్తున్నాను.

ప్రసంగ సాధ్వసాధుతలను గూర్చి సభ్యులకు వదలివేద్దాం. అందులో సుప్రీతులూ, అప్రీతులూ,కూడా ఉండవచ్చు. 'న హి సర్వ స్సర్వం ప్రీణయతి'

అనువాదం :_ అను వాదం తప్పుగా చిరకాలం నుంచి అలవాటు చేశారు. సంస్కృత గ్రంథాలను ఇంగ్లీషులోకి అనువాదం చేసిన ప్రతాపచంద్రరాయ్, పిక్ ఫోర్డు మొదలైన వారు మూలగ్రంథం నుంచి ఒక్కమాట మార్చేహక్కు అనువాదకుడికి లేదన్నారు. అట్లా వారు అనువదించారు. అదీఅనువాదం అంటే_ అసలు_అనువాదం అనే మాట ఇంగ్లీషు బడిచదువులలో పుట్టింది. మన పూర్వకవు లెవ్వరూ వాడలేరు. ఆంధ్రీకరణం, అనువాదం ఒకటి కాదు. ఆంధ్రము కాని దానిని ఆంధ్రముగా చెయ్యడానికి చాలా మార్పులు చెయ్యాలి. అలా చేస్తేనే తెలుగుచెయ్యడ మవుతుంది. ఆ మార్పులు మన తెనుగుకవులు అనంతంగా చేశారు. కథలో, కవితలో, వాక్యోవాక్యంలో, సన్నివేశాలలో. అనువాద శబ్దం శుకానువాదంలో ఉంది. తెలుగుకవులు ఆ పని ఎప్పుడూ చెయ్యలేదు. ఆలంకారిక ప్రముఖులు శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు తమ ఆంధ్ర ధ్వన్యాలోక పీఠికలో 'తెనుగున నన్నయాదుల భారతము వ్యాసున కాంధ్రీకరణము కాదు; స్వతంత్రమగు గ్రంథము' (పుట 15) అన్న మాటలు ఈ అనువాద వాగులు చిరము భావించవలసినవి.

రామాయణ భారతాలు :_ మృతప్రాయము లన్నమాట ప్రసంగకర్త ఉపయోగించలేదు. ఆంధ్ర భారత మాధుర్యం వల్ల, సంస్కృతభారతం వెనక పట్టి ప్రచారంలో నుంచి పోయిందనే భావం వ్యక్తపరిస్తే_ లేఖకుడు 'మృత' శబ్దాన్ని వరించడం శోచనీయం. ఇక్కడ రామాయణం ప్రసక్తి లేనే లేదు. ఉంటే, సంస్కృతరామాయణం బహుళ ప్రచారంలో తెనుగు రామాయణాలు లేకపోయా యని చెప్పడం జరగింది. దీనికి మృత శబ్దం ఎట్లా సమన్వితమో వ్యాఖ్యాతకే తెలియాలి. భారతంలో అనౌచిత్యాలు చూపించి నన్నయ వానిని ఎట్లా పరిహరించాడో సోదాహరణంగా చెప్పడం జరిగింది. రామాయణంలో అనౌచిత్యాలని ఎక్కడా అనలేదు. భారతప్రసంగంలో వాటి ప్రసక్తి అప్రకృతం 'అనౌచిత్యాల పుట్ట' లనే ధ్వని వ్యాఖ్యాతకు ఏమూలనుంచి వినపడిందో దురూహం.

'...భారతరామాయణాలని ...... నన్నయ ఆంధ్రీకరణకు పూనుకొన్నారన్నారు' కనీసం_ నన్నయ రామాయణం తెనిగించలేదని ఐనా ప్రసంగకర్తకు తెలుసు. వ్యాఖ్యాత వ్యాఖ్యావైఖరికి ఇది మచ్చుతునక.

నన్నయగారికి, ఆనాడూ ఈనాడూ అడ్డు తగిలి అపకారం చేసినవారు ఎవరో కాదు; మన ఛాందస పండితులు తొలి నాడు భారతాన్ని అసలు తెలిగించడమే అపరాధమనీ, ఒకవేళ తెనిగిస్తే ఆ పంచమవేదం అంతా తెలుగులోకి దించాలనీ పట్టుపట్టి ఈ 'పండితోత్తములు' యుద్ధం ప్రకటించకపోతే_ఆయన 'పాయక పాక శాసనికి' అనే పద్యంలో యుద్ధోపమానం వాడడం ఎందుకూ? నారాయణుడు తోడయి నిర్వహించడం ఎందుకు? తెలుగు భారతానికి పీఠిక రాస్తూ ఒక 'పండితుడు' ఈనాటికీ ఇట్లా విచారిస్తున్నాడు. వ్యాసప్రోక్త మయిన సర్వధర్మాలూ, ఉపాఖ్యానాలు, అందుకో గల్గిన అదృష్టవంతులు కాలేకపోయారు తెలుగువారు' అని_

వ్యాసభారతం యావత్తు తెలుగులోకి వస్తే సంస్కృత భారతంలాగనే ఇదీ పరిమిత పరిధిలోపడి, ప్రజాసామాన్యం లోకి వెళ్ళకుండా ఉండేది. నన్నయగారు భారతాన్ని ఇతిహాసంగా తేదలచుకో లేదు. కావ్యంగా రసమహితంగా శిల్పభరితంగా తెలుగు వారికి అందించ దలచుకున్నారు. ఆ రసశిల్పాలు, ఈ నీరసులకు అక్కరలేదు. ఆ కేవలేతిహాసత, ఈ తెలుగులకు అక్కర లేదు. అక్కడే ప్రారంభ మయింది రగడ.

'దేశభాషా పురాణాని
రచితాని చ మానవైః

'శ్రుత్వా కావ్యేతి హాసాంశ్చ
భయ మాప్నోతి పూరుషః'
(బాలసరస్వతి టీకలో)

అని పండితుల నిషేధాజ్ఞ. దాన్ని తిరస్కరించడం నన్నయ ప్రజ్ఞ. వ్యాసుని అక్షరాలకు వారు ప్రాముఖ్యం ఇస్తే - అంతరంగాన్ని పట్టుకుని వ్యాఖ్యానించడం నన్నయ ఉపజ్ఞ. లోక శ్రేయస్సు కోసం స్తబ్ధమైన నియమాల్ని ఉల్లంఘించడం విప్లవం. ఆ విధంగా తెలుగు సాహిత్యంలో మొదటి విప్లవం సాధించింది నన్నయ!

ఆ విప్లవాన్ని ఆదినుంచీ కంటగించుకుంటూనే ఉన్నారు శుద్ధశ్రోత్రియులు. ఈ గాలి శ్రీనాథునకూ తగిలి ఉంటుంది. కనుకనే 'రాజమహేంద్ర పట్టణమున నే ధర్మాసనం బుండి' స్థూలహాస్తావలేపాలు చేసిన పండితులను అంతగా 'సత్కరించాడు'.

మూలగ్రంథాలు ధవళకుడ్యాలు; రసవదాంధ్రీకరణాలు సుందరచిత్రాలు. కుడ్యం లేక చిత్రాలు నిలువవు. చిత్రాలశోభ కుడ్యాల కుండదు. వేటి విలువలు వాటికున్నాయి. దీన్ని బోధపరచుకోవడమే వివేకం.

ప్రముఖులను విడిచిపెడితే_ఆ సాహిత్య శ్రోత్రియుల 'వారసులు' మా అనుంగు తెనుంగు సోదరులు ఇప్పటికీ ఉన్నారు. వారు నన్నయగారి రచనాభోగాన్నంతటినీ మూడు ముక్కల్లో తేల్చి నేటికీ గాడి తప్పకుండా బోధిస్తున్నారు.

1) ఆయన మూడువంతుల సంస్కృతము, ఒకవంతు తెలుగు వ్రాయును.

2) కవిత్వములో అక్షర రమ్యత యుండును.

3) ప్రసన్నమైన శైలి.

వీటినైనా చదివి అనుభవించి చెప్పడం కాదు. పరంపరాప్రాప్తమైన పాతపాట. ఈ మాటలు ఏ విద్యార్థినీ, భావుకుణ్ణీ, ఉత్తేజపరచలేకపోయాయి. ఫలితంగా ఆదికవిమీద సూటియైన అవగాహన లేక ఆయనమీద కొందరికి ఉపేక్షాభావం, కొందరికి చిన్నచూపు సిద్ధమైంది. దీనితో కొందరు అనభిజ్ఞులు విజృంభించి -

1) నన్నయ మొదటి అనువాదకుడు మాత్రమే.

2) ఆయన బ్రాహ్మణ ప్రశంసకోసం భారతం తెలిగించాడు.

3) సంస్కృతానికి డు, ము, వు, లు, తగిలించాడు.

4) జాతీయతను గుంరం చేశాడు.

అనే దుష్ప్రచారం ప్రారంభించారు. ఈ అవ్యక్తాలాపాలను ఖండించడానికి నన్నయ రచనమీద కొత్త వెలుగులు ప్రసరించాలి.

'ప్రసన్న కథా కలిత'అన్న అపపాఠం విడిచి_ 'కథా కవిత' సాధుపాఠం స్వీకరించి (నూటికి 90 తాళపత్రగ్రంథాలలో ఉన్నదని తజ్జ్ఞులు నిరూపించారు) ఆయన కథనంలోని ప్రసన్నత ఏమిటో కవితలోని ప్రసన్నత ఏమిటో, పద్య విద్య అన్న మాటలోని బలం ఎట్లాంటిదో వివరించాలి.

ఆయన జాతీయత ఎంత స్నిగ్ధమైనదో విడమర్చి చెప్పాలి. ఇదీ ఆ ప్రసంగకర్త ఆవేదన. దీన్ని నేటికైనా గ్రహించాలని పండితులను సప్రశ్రయంగా అభ్యర్థిస్తున్నాడు.

'స్వస్థాన వేష భాషా' అన్న చింతామణి నన్నయభట్టారక కర్తృకమే అని వజ్ఝలవారు_చింతామణి విషయపరిశోధనలోను, దువ్వూరివారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ఆంధ్రవ్యాకరణ ప్రసక్తిలోను, నిస్సందేహంగా నిరూపించారు. ఇంకా సంశయాత్ములుంటే వారికి నన్నయగారే కలలో కనపడి చెప్పాలి.

ఇంతకూ_ నన్నయగారి కొద్ది పద్యాల పాఠ్యంలో ఇవన్నీ చెప్పడం సాధ్యమా? అని ప్రశ్న. మనసుంటే మార్గముంటుంది. నిస్సందేహంగా కష్టంగా చెప్పవచ్చు.

తెనిగింపులతో కవుల మవుదామనుకొన్నవారి రచనలో వస్తువే ఉంటుంది; అనుభూతి ఉండదు. కవులై తెనిగించిన వారిరచనలో అనుభూతి సమృద్ధిగా ఉంటుంది. ఆ శక్తిని వారికి నవనవోన్మేష జాలిని యైన ప్రతిభ ఇస్తుంది. ఆ ప్రతిభ లేని వారు ఎంత మహానుభావులైనా - ఎన్ని ఉద్గ్రంథాలు తెనిగించినా_రసానుభూతి కొరవడి-ఆగ్రంథాలు ఏఅభిజ్ఞులనూ అలరించలేక, పునర్ముద్రణానికి కూడా నోచుకోవు.

రామాయణం కావ్యం, భారతం ఇతిహాసం. వాటి అనుభూతులు భిన్నమైనవి. అవి ఎట్టివో సహృదయులకు తెలుసు.

నన్నయగారున్న తెనిగింపులో కొన్ని లోపాలు చేసి ఉండవచ్చు. కాని ఆయన రచన, గుణబాహుళ్యంవల్ల తెలుగులకు శిరోధార్యం అయింది. దానికి తిరుగులేదు. నన్నయ భారత భాగాన్ని హృదయదఘ్నంగా చదివినవారికి ఈ సంగతి విస్పష్టం.

ప్రసంగసమయం పరిమితం; పుస్తక విషయం అపరిమితం. కనుక సోదాహరణంగా బలపర్చవలసిన విషయాలు కొన్ని పొడిపొడిగా ఉండిపోయిన మాట నిజం. ఆలోపం తప్పక సవరించవలసిందే.

ఏతావతా_ మీ వ్యాఖ్యాత విమర్శిస్తే తప్పు లేదు.

మరికొంత_సముగ్రావగాహనం, విశాల భావన ఉపయోగిస్తే అదిసర్వసమ్మతంగా ఉండేది.

ఎంత కష్టంగా వ్రాయదలచుకొన్నా దీనిని ఇంతకంటె కుదించడం సాధ్యం కాలేదు. మన్నించగలరు.

- ఇం. హా.

# అభినందన లేఖ

'సమాలోచన' లో ఉండగా ఇప్పుడే డాక్టర్ జోగారావు గారి 'చంద్రకళ' దర్శించడం తటస్థించింది.

పరాశక్తి చిఱునవ్వు దవ్వులనుండి దగ్గఱకు వచ్చి పలకరించినట్టుగా అనిపించింది.

ఎంత బాగా ఉన్నాయి పద్యాలు!

కుసుమాయుధుణ్ణి చంపి పుట్టిన ఒకానొక సొగసు గుండెకు ఆసేచనకంగా ఉంది.

'అస్మద్భార్గవాన్వయర్షులు శివభక్తిపరులు' - ఇది సీసము కాదు; సువర్ణము; సవర్ణము.

కామేశ్వరాంకస్థిత యైన దేవి నయనాంత రేఖ వారి లేఖినికి దీప్తిదాయిని!

ఊరక వ్రాయడం కాదు.

చంద్రకళాశీర్షికానందానుభవం తెలుగుపద్యాలతో కలిగించడం కాదాచిత్కం.

ఈ చిత్కళ తక్కువమందికే దొరుకుతుంది. అందులో వారొక్కరు నాకు దొరికారు.

(సం) మ. సత్యనారాయణశాస్త్రి

---

# నన్నయ జయంతి లేఖకు - ప్రతిలేఖ

'సాహిత్య విమర్శకుడుగా విమర్శను ఆహ్వానిస్తాను. విమర్శకు వెరగుపడడం గాని, వెగటుపడడం గాని, సాహిత్యానికి మేలుకూర్చదు.' అంటూనే శ్రీ ఇం. మా. గారు సమాలోచనలో వారి ప్రసంగమును గూర్చి చేసిన విమర్శకు 'వెగటుపడడం' మాకు 'వెరగు' కలిగిస్తూంది. వారి వెగటుకు మా పత్రికా విలేఖకుని అనవధానత కారణం అని వారంటారు. వారన్న మాటలు మా విలేఖకుడొక్కడే ఆ విధంగా ఉటంకిస్తే అతని అనవధానత అనవచ్చు. కాని అదేవిధంగా ఇంకొక పత్రికేయుడుకూడా రాస్తే, విన్నవాళ్ళందరూ అనవధానులూ, అన్నవారు ఒక్కరే శ్రద్ధధానులూ అనడం సముచితం అనిపించుకొంటుందా ?

వారు సంస్కృత భారతం మృతప్రాయం అయిపోయిందని అనని మాట నిజం. అయితే అంతకంటె కటుతరమైన 'చచ్చింది' అన్నమాట ఆయన వినిపించారు. ఆ 'చచ్చు' మాటను పరిహరించి మా విలేఖకుడు 'మృతప్రాయం' అన్నారనడం, వారే అంగీకరించినట్లు, నిజంగా వాని 'సున్నితత్వా'నికి నిదర్శనం. 'చచ్చింది' అని వారన్నట్లు రాజమండ్రి సమాచారంలో కూడ ప్రచురితమైందని ప్రసంగకర్త గుర్తించాలని మనవి. ఇది విన్నవారి అనవధానతయా? లేక అన్నవారి అనృతవాదితయా? 'చచ్చు'మాటను వరించిన ప్రసంగకర్త గౌరవాన్ని మా విలేఖకుడు 'మృతప్రాయం' అనే శబ్దాన్ని పరించి కాపాడినందుకు ఆయన కృతజ్ఞత చూపించాలి.

ఇక అనువాదం అన్న సంగతి.

తెలుగు భారతం సంస్కృత భారతానికి వారన్న శుకానువాదం అని ఎంత తెలివి తక్కువవాడూ అనడు. అది వారు క్రొత్తగా చెప్పనక్కఱలేదు. శుకానువాదం కాదనడంలోనే ఇంకొకరకం అనువాదం ఉందని వారే అంగీకరించినట్లు స్పష్టమవుతోంది. అది స్వేచ్ఛానువాదం. అది శ్రీనాథుడు చెప్పిన 'ఔచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు' వంటి అనువాదం. శిల్పవిషయంలో కొంత స్వేచ్ఛ వహించినంతమాత్రాన నన్నయభారతం సంస్కృత భారతానికనువాదం కాకుండా పోతుందా ? భారతం నన్నయ సొంత గ్రంథమా ? ఆయన సంస్కృత మహాభారతేతిహాసాన్ని స్వీయ ప్రతిభచే కావ్యంగా అనువదించుకుంటూ పోయాడంటె, మహాపరాధమేమిటో మాకు గురవగాహమైన విషయం. తెలుగుభారతం సంస్కృత భారతానికనువాదం కాదనడం, మూలకర్తకూ, ఆంధ్రీకర్తకూ కూడా అపచారం.

ఆంధ్రీకరణం వేఱు, అనువాదం వేఱు అని చెప్పి, నన్నయది ఆంధ్రీకరణమే కాని అనువాదం కాదంటూ ప్రసంగకర్త శ్రీ తిరువేంగళాచార్యులు గారి ఆంధ్రధ్వన్యాలోక పీఠికలోని 'తెనుగున నన్నయాదుల భారతము వ్యాసున కాంధ్రీకరణము కా' దన్నమాటలు ఉదాహరించారు. ప్రసంగకర్త 'నన్నయభారతం అనువాదం కాదం' టూండగా, శ్రీ ఆచార్యులుగారు అది ఆంధ్రీకరణమే కాదంటున్నారు. స్వవచోవ్యాఘాతాలైన ఆచార్యులవారి మాటలను ప్రసంగకర్త లుదాహరించి వాటిని మా విలేఖకుఁడు 'చిరము భావించవలసిన' వనడం సుతరాం అసమంజసం.

ఇంతకీ నన్నయ భారతాన్ని గూర్చిన అభిప్రాయాలందఱివీ ఒక్కటే. అది ఆయన సంస్కృత భారతానికి చాలచోట్ల మెఱుగులు దిద్దాడన్నది. అది ఒప్పుకుంటూన్నప్పుడు దాన్ని ఆంధ్రీకరణం అన్నా, అనువాదం అన్నా, రెండూ అన్నా పెద్ద కొంప ముంచుకుపోయే ప్రమాదం ఏమీ లేదు.

ఇక ప్రసంగకర్త కేవలానువాదాన్ని గూర్చి కొంత ఈసడించారు. అదికూడా చాలాకష్టమనీ, కొన్నింటిని తెలుగుచేయడంలో అది అవశ్యం ఆదరణీయం అనీ వారు గుర్తించాలి. సంస్కృత భారతం ఇతిహాసం కాబట్టి అందులో కవితాకళ కంత ప్రాధాన్యం లేదు. కాబట్టి నన్నయాదులు భారతాన్ని ఆంధ్రీకరించడంలో ఇటువంటి స్వేచ్ఛానువాద పద్ధతి ననుసరించారు. కాని కవితా కళామయాలయిన రఘువంశాదుల ఆంధ్రీకరణంలో అటువంటి స్వేచ్ఛానువాదపద్ధతి అనుసరణీయం కాదు. అక్కడ (తెలుగుజాతీయత చెడని) యథామూలానువాదం అవశ్యం అవుతుంది. వాటిలో మన పైత్యం చేర్చామా, అది మూలశోభాభంజకమై మూలకర్తకన్యాయం చేసినవాళ్లం అవుతాం. అంచేత అనువాదాల్లో గల ఈ తేడాల్ని ప్రసంగకర్త గుర్తించాలని వారిని సప్రశ్రయంగా వేడుకుంటున్నాము.

ఇక నన్నయ రామాయణం రాశాడని ప్రసంగకర్త అన్నారనడం మా విలేఖకుడి అభిప్రాయం కాదు. అయినా నన్నయ రామాయణం రాయాలనుకోలేదని యెవరైనా చెప్పగలరా ? ఏమో ! భారతం అనంతరం రామాయణం రాద్దామనుకున్నాడేమో? భారతమే పూర్తి చేయలేను కాబట్టి అది జరగలేదేమో! మఱి తరువాత వచ్చిన ఎఱ్ఱన రామాయణం రాశాడంటున్నారు గదా ! అటువంటి మహోన్నతాశయం ఆ పూర్వుల కుండేదన్న అభిప్రాయంతో మాటవరసకన్న మాటను పట్టుకొని ప్రసంగకర్త నన్నయ రామాయణా

న్ని వ్రాయలేదని తనకు తెలుసుననడం అనవసరం. చాలా 'సిల్లీ' గా ఉంది.

నన్నయభారతంలో కావలసినంత యథామూలకతా ఉంది. వ్యాసుడిలోని రామణీయకాన్ని విడిచిన ఉదాహరణలూ కోకొల్లలుగా ఉన్నాయి. అది సమగ్రంగా నన్నయభారతాన్ని సంస్కృతభారతంలో పోల్చినవాళ్ళకే తెలుస్తుంది.

మా విలేఖకుడు మొదట అనలేదు. ఇప్పుడంటున్నాడు. ప్రసంగకర్త కొన్ని పద్యాలకు వ్యాఖ్యానించినతీరు తప్పుదారి పట్టింది. ముఖ్యంగా 'అలఘు ఫణీంద్రలోక...' అన్న పద్యానికి వారు అచల శబ్దానికి మైనాకు డనే అర్థం చెప్పడం మిక్కిలి శోచనీయం. 'శితపీడితులయ్యు మహావ్రతదీక్షితు లగుటచే అచలులైన (నిశ్చలులైన) మునులకు సౌఖ్యహేతుకమైన బడబాగ్ని కలది సముద్రం' అని అర్థం చెప్పాలి.

ఈ కువ్యాఖ్యలు వారి ప్రసంగలోనే కాదు వారి 'సారమతి' లో కూడా ఉన్నాయి. మా విలేఖకుడు ప్రసంగకర్త చేసిన ఇలాటిపొరపాట్లను మర్యాదకోసం కప్పిపుచ్చి వారి గౌరవం కాపాడినందుకా, వారి కవగాహన లేదనడం?

ఆనాడు నన్నయ భారతాంధ్రీకరణానికి ఛాందసులైన పండితులు యుద్ధంచేసి ఉంటారనేది ఊహామాత్రమే. 'సాయక పాకశాసనికి' లో నన్నయ యుద్ధప్రసంగాన్ని తేవడంవల్ల కొందఱు అలా పరంపరగా ఊహిస్తున్నారు. అది చారిత్రక సత్య మెలా అవుతుంది? అందులోని 'భారత ఘోరరణంబునందు' అన్నదానికి భారత రచన అనే ఘోరరణమునందని అర్థం ఎందుకు చెప్పరాదు? కురుక్షేత్ర యుద్ధంలా, భారతాంధ్రీకరణం కష్టమైందని వ్యాఖ్యానించకూడదా?

తెలుగుసాహిత్యంలో మొదటి విప్లవం సాధించింది నన్నయఅని వారంటున్నారు. నన్నయ ప్రథమాంధ్రకవి. తెలుగులో కావ్యరచనకి బాటలుతీర్చినవా డాయన. తరువాతికవు లెవరైన తద్విరుద్ధంగా ప్రవర్తించినట్లయితే వారు విప్లవకవులవుతారు కాని మొట్టమొదటివాడే విప్లవకవి యెట్లా అవుతాడు? ఆనాటి పండితుల నిషేధాజ్ఞల్ని ఆయన ఉల్లంఘించేడనా?అదంతా ఊహామాత్రమే. నన్నయ భారతాంధ్రీకరణాన్ని ఆనాటి ప్రభువు రాజరాజు ప్రోత్సహించేడు. ఆనాటి పండిత పరిషత్తులు తమ ఆమోదాన్ని తెలిపాయి. నన్నయ రచన ఆనాడు కవీంద్రులూ, ఇతరులూ కూడా మెచ్చుకున్నారు. అంతే కాని ఆయన మీద యుద్ధంప్రకటించారనడం సరికాదు. బాలసరస్వతి అన్నది అపుద్రచనల్ని గూర్చి. అంతేకాని నన్నయ భారతంవంటి రసవత్కావ్యాల్ని చూచి కాదు.

నన్నయగారిని గూర్చి ఉపాధ్యాయులు విద్యార్థులకు తప్పుగా బోధిస్తున్నారని ప్రసంగకర్త వాపోయేరు. ఎవరో కొందఱు అసమర్థులు అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉంటూనే ఉంటారు. సమర్థులూ ఉంటారు. అలా అని, మనం రిటైర్ అయ్యాంకదా అని, ఉపాధ్యాయులోకం అంతా అసమర్థం అని విఱుచుకుపడడం ధర్మంకాదు.

ప్రసన్నకథాకలితార్థయుక్తి పాఠం అపపాఠం అనడం సబబు కాదు. బహుళ తాళపత్రగ్రంథాల్లో కనబడడం ఒక్కటే ఒక పాఠం సాధుత్వానికి ప్రమాణం కాదు. ఇక్కడ ప్రసన్నకథాకవితార్థయుక్తి అన్నా అర్థంసరిపోతుంది. ప్రసన్నకథలతోకూడిన అర్థయోజనము ప్రసన్నకథా కలితార్థయుక్తి. ఇక్కడ అర్థం అంటే రసాలంకార చమత్కారాది కవితా సంబంధ్యర్థం అన్నమాట. ప్రసన్నకథాకవితార్థయుక్తి అనే పాఠంలో ఆ అర్థం కవితాసంబద్ధార్థంఅని స్పష్టంగానేఉంది. అందుచేత నన్నయ రచితపాఠం ఇదీ అని స్పష్టంగా చెప్పలేము.

అనుచిత ప్రసంగాలు చేస్తే రాజమహేంద్రపట్టణ విద్వాంసులు ధర్మాసనం నుండి శ్రీనాథుణ్ణి కాదుగదా తదధికుడినైనా సరే అప్పుడేకాదు ఇప్పుడూ spare చేయరని శ్రీ శాస్త్రిగారు గ్రహించాలి.

ఆ సందర్భంలో శ్రీనాథుడి అసభ్యపు, అవాచ్యపు ప్రసంగం (అది నిజంగానే శ్రీనాథుడిదే అయితే) అతడి శృంగభంగాంగీకారాన్నే తెలుపుతుంది తప్ప, ఆ విద్వద్వరేణ్యుల కెలాంటి న్యూనతనూ ఆపాదించకపోగా, చివరకి స్వీయహానికే కారణంగా పరిణమించవచ్చు.

నన్నయ భారతాన్ని కేవల బ్రాహ్మణ ప్రశంసకోసం రచించినా రచించకపోయినా, అత డమూలకంగా చేసిన బ్రాహ్మణ ప్రశంస కెన్నో ఉదాహరణలు అతడి భారతంలో ఉన్నాయి. అది అతనికిగల బ్రాహ్మణ భక్తికీ, ఆనాడు బ్రాహ్మణులకు సంఘంలో ఉండిన మహోన్నత స్థానానికీ నిదర్శనం. దానికి శ్రీ శాస్త్రిగారు వ్యథ చెందవలసిన అవసరం లేదు.

అనావశ్యకమైన అనువాద వాద నిరాకృతికోసం ప్రసంగకాలం అంతా వినియోగించి, నన్నయ చేసిన మెఱుగుల్ని ఉదాహరించలేక, ప్రసంగాన్ని నీరసం చేశారని పలువురి సభ్యుల, కొంతమంది సభాధ్యక్షులఅభిప్రాయంతో మా విలేఖకుడు ఏకీభవించి అలా రాయడం జరిగింది. పాఠకులకు సత్యాన్ని ప్రకటించడమే పత్రికా విలేఖకుల ధ్యేయంకాని, వారికి సరియైన అవగాహన కలగకపోతే, బాధ్యత ప్రసంగకర్తలదేఅవుతుందికాని, పత్రికావిలేఖకులది ఎలా అవుతుంది?

(సంపా.)

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన అతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు వీలైనంతవఱకు ప్రయత్నింపఁ బ్రార్థన.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.

అడ్రసు :—.


సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,

Retired Telugu Lecturer, V. T. J. College,

6-8-7, ఇన్నిసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.


## చందాదారులకు

సమాలోచన మొదటి సంపుటము 1 to 24 సంచికలు 2 వాల్యూములుగా బైండు చేయబడి యున్నవి. రెండువాల్యూమ్ముల వెల పోస్టేజీతోసహ రు 18-00 లు ఎం. ఒ. ద్వారా పంపువారికి రిజిష్టర్డు పోస్టులో పంపబడును.

— సంపాదకుడు 'సమాలోచన'


Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.